c

(Prescribed for B. A. & B. Sc. by the Andhra University)

# సాహిత్య చంద్రిక



శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల.
పొన్నూరు.

# సాహిత్య చంద్రిక



శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల
పొన్నూరు.

వడ్డెంగుంట అంకయ్య, ఎం. ఏ.
ఆంధ్రోపన్యాసకుడు
వి. బి. యస్. కళాశాల, నిడుబ్రోలు.

అభిప్రాయములు

## ఆంధ్ర పత్రిక

రచయిత:- వి. అంకయ్య. ఎం. ఏ., ఆంధ్రోపన్యాసకులు, పి. బి. యన్. కళాశాల, నిడుబ్రోలు.

ఇది చక్కని వ్యాస సంపుటి. ఈ సంపుటిలో కళా సౌందర్యము-మానవుడు, కవిత్వము-సంగీతము, సాహిత్యములో సత్యభామ, కళ-నీతి, భారతీయనాట్యకళ-వికాసము, భారతీయ సంస్కృతీ సాహిత్యములు అనే ఆరు వ్యాసము లున్నాయి. సులభమైన శైలిలో చక్కని శబ్ద సౌందర్యం కలిగి సుబోధకంగా వున్న ఈ వ్యాసాలు ఒక్కొక్కటి ఒక్కొక్క మణిపూస, ఆణిముత్యం అని చెప్పక తప్పదు. తొలినుడిలో డాక్టర్ యస్వీ. జోగారావు గారన్నట్లు 'ఇది మన విద్యార్థులకొక చక్కని సంస్కారలేప మీయగల వ్యాస సంపుటి.

17-7-1960

***

## ఆంధ్రజ్యోతి (విజయవాడ)

ప్రాచ్యపాశ్చాత్య విమర్శల నాకళించుకొని వ్రాసిన వీనిలో ఆయా శీర్షికలకు చెందిన అనేక విషయాలు పరామృష్టములైనవి.

మరీవిస్తృతమైన అంశాలపై మరీసంగ్రహంగా చెప్పడం కష్టం. అయినా కొంత ప్రత్యేకత చూపించిన గ్రంథకర్త అభినందనార్హులు.

(16-5-1961)

## ఆకాశవాణి (విజయవాడ) 12-11-60

ఈనాడు సాహిత్య ప్రపంచంలో వ్యాస రచనా ప్రక్రియకొక విశిష్టస్థానముంది. వ్యాసరచయితకు సునిశిత విమర్శనాశక్తి, వివేచనాజ్ఞానం ఉండడం ఎంతయినా అవసరం. యిట్టి విషయములగూర్చి వివరించుట సామాన్యంకాదు.

ఈ ఆరు వ్యాసాలలోనూ సాహిత్యంలో సత్యభామ అనే వ్యాసం రచయితకు గల విమర్శనా పటిమను పట్టి యిచ్చేది. నిజానికి సత్యభామ ఎట్లుండునో మనకు తెలియదు. సత్యభామా శ్రీకృష్ణులకు సంబంధించిన గాథలు కల పురాణేతిహాస కావ్యాలనుండి ఆయా ఘట్టాల నెన్నుకొని సత్యభామ స్వరూప స్వభావాలను చిత్రించడానికి ఉపకరించే పద్యాల నుదాహరిస్తూ రచయిత ఎంతో నేర్పు చూపారు. ఉదాహృత పద్యాలు సందర్భశుద్ధి కలిగి సత్యభామయందుగల నేటి నాగరికస్త్రీస్వభావములు, ధైర్యసాహసములు, రసికత్వము, చిలిపితనములను స్పష్టంచేస్తూ ఆమె శృంగారమూర్తిని మనకు సాక్షాత్కరింపచేస్తాయి.

భారతీయ నాట్యకళ-వికాసము అనేవ్యాసం నాట్యకళ యొక్క పుట్టుపూర్వోత్తరాలనూ క్రమాభివృద్ధి వికాసాలనూ నిరూపిస్తూ సాగిన రచన. ఇందు నృత్య అభినయ, నాట్యాల పరస్పర సంబంధం నిరూపితమైంది. కళ-నీతి అన్న వ్యాసం కళయనగా నేమి? కళకు నీతి ప్రధానమా లేక కళ కళక కళాప్రయోజనమేమి? అన్న అంశాలపై చర్చసాగింది. భారతీయ సంస్కృతీ సాహిత్యాలకు చెందిన అనేక విషయాలు విపులంగా చర్చించారు యీ ఆరు వ్యాసాలు చదివినమీదట రచయితకుగల వివిధ విషయ పరిజ్ఞానం వ్యక్తమవుతుంది

# తొలినుడి

ఇది సాహిత్య చంద్రిక - ఒక చక్కని వ్యాస సంపుటి.

ఇది యొక సాహిత్య సత్య ప్రసూని కళాదర్శనము. కమ్రభావ ప్రవచనము.

ఇందు మానవాత్మ మహానుభావతకు సంబంధించిన సాహిత్యము, సంగీతము, నాట్యము అను కళాస్వరూపముల తత్త్వానుశీలనము, కళా సౌందర్యము, నీతి, సంస్కృతి అను భావవ్యవస్థల వివేచనము, అందు కొన్నింటి యనుబంధముల గూర్చిన సమ్యగ్విచారము అందందు భారతీయ సంప్రదాయము ఆంధ్ర సాహిత్యముల విశిష్ట ప్రసక్తియును గలవు. కేవలము భావగమ్యములు, అనుభవస్వాద్యములునగు నిట్టి విషయముల గూర్చి వ్రాయుట అందరికిని సాధ్యమగుపనికాదు.

ఈలాటి విషయ పరిజ్ఞానము, వివేచనా చణత్వము కళా స్రష్టలకంటె గూడ కళాద్రష్టల కెక్కువ యవసరము ఆ సామాగ్రి సమృద్ధిగా గలవారు మిత్రులు శ్రీ అంకయ్యగారు.

కర్తృనిష్ఠమైన చిత్తశుద్ధియు, భావసంయమన ప్రచోదితమైన సంస్కారము, విషయవైశద్యము, అపేలవము, సరళము, సుబోధము, సుందరమునైన రచనా పద్ధతితో సాగిన వచనశైలియు గలిగి యుందలి ఆఱు రేకలును పదునారు కళలు విరిసినట్లు పరిఢవిల్లుచున్నది.

ఇది మన విద్యార్థులకొక చక్కని సంస్కారలేప మాయగలదని విశ్వసింతును. వారికీ యుపకార మొనర్చిన అంకయ్యగారిని మనసార అభినందింతును.

వాల్తేరు
-6-60

డాక్టరు యస్వీ. జోగారావు.
ఎం. ఏ. పిహెచ్. డి.
ఆంధ్రోపన్యాసకులు, ఆంధ్రవిశ్వవిద్యాలయము.

# మలినుడి

భాషారూపమున పిల్లుబికిన, హృదయగతమగు భావ చంద్రికా సంచయమే - ఈ సాహిత్య చంద్రిక. ఇది వివరణ, విమర్శాత్మకము లగు సాహిత్య రత్నాకరము

భావవ్యక్తీకరణము పద్యమునకంటె, గద్యమున సులభసాధ్యమను విషయము సర్వజనాంగీకారమే కదా! కావున నేటి సాహిత్య జగత్తులో గద్యరూపమగు వ్యాసము ప్రధానపాత్రవహించి, బహుప్రశస్తి గాంచుచున్నది.

ఈ వ్యాసరచనకు మొట్ట మొదట సంకురార్పణము గావించినవాఁడు 'Montaigne' అను ఫ్రెంచీదేశ రచయిత. అతఁడు క్రీ. శ. 1571 లో ఆత్మార్థమైన కొన్ని వ్యాసములను రచియించెను. వానిని Essai, అని పిలిచెను. ఆంగ్లేయులు వానినే Essays అనిరి. అప్పటినుండియు, నీ వినూతన సాహిత్య ప్రక్రియా విశేషము, భాషాసౌభాగ్యములోను, భావసౌందర్యములోను, వస్తుసంపదయందును, రూపవిస్తృతి యందును వైవిధ్యమును బొంది, వివిధ దేశములలో -సర్వ భాషలలో-రచయితల చేతులలో రమణీయముగా రాణించుచున్నది.

నేడు సాహిత్య లోకమున వ్యాసరచనా విన్యాసము కున్న ప్రధాన ప్రాతినిధ్యము, మఱొక సాహిత్య ప్రక్రియ లేదనుట అతిశయోక్తి కానేరదు. ఒక సమగ్ర విషయము స్థాలీపులాక న్యాయముగా, స్వల్పకాలములో హృదయ నకు హత్తుకొనునట్లు, విచక్షణ, వివేచనా జ్ఞానమును -

దానుభూతిని-ఆత్మాలోకనాశక్తిని-యుక్తి యుక్తముగా వివరించునది వ్యాసమొక్కటియేయని చెప్పనొప్పును.

మదీయ భావ సమీక్షకులు, మిత్రులు, శ్రీ యస్వీ. జోగారావుగారి తొలినుడితో నా సాహిత్య చంద్రిక సంపూర్ణ కళానిధి, సౌందర్యరాశియైనది. వారికి నా శతనతులు. సహృదయులు నా సత్సంకల్పమును సాదరముగా సమీక్షింతురుగాక!

రచయిత.

సూచిక

✓ కళాసౌందర్యము - మానవుఁడు
కవిత్వము - సంగీతము ⟶ 1967 ర
✓ సాహిత్యములో సత్యభామ - 1966 Ma...
కళ - నీతి
✓ భారతీయ నాట్యకళ - వికాసము
భారతీయ సంస్కృతీ సాహిత్యములు

# "సాహిత్య చంద్రిక"

## కళాసౌందర్యము - మానవుఁడు

దైవసంకల్పమగు సృష్టి - ఒక కళ. కావున విశ్వము కళామయము. ఈ కళలు త్రిగుణాత్మకములు : సత్య-శివ-సుందరములు. యుక్తియుక్తమగు పరిజ్ఞానమును గలిగించునది సత్యము. (The object of legal knowledge is truth) ఇది సహేతుకమైన పరిపూర్ణత్వము కలిగియుండును. నైతిక బలమునుగలిగించు పరిపూర్ణత్వముశివము. Goodness, రసపరిజ్ఞానమయమైనది సుందరము. (The object of aesthetic knowledge is beauty) ఇది జ్ఞానేంద్రియములకు గోచరమగు పరిపూర్ణత్వమును గలిగియుండును.

సత్య- శివ- సుందరములు మూఁడును మనురములు. ...బంధసామ్యములును. ఇవి హృదయజనితములు. సూక్ష్మ పరిశీలనకివి భిన్నములయినను, స్థూలపరిశీలనమున సౌందర్యమే ప్రధానముగాఁ గన్పట్టును, ఈ త్రిగుణాత్మకస్వరూపుఁడే ఈశ్వరుఁడు. సత్య-శివ-సుందరములను దెలిసికొనుట యనగ నీశ్వరుని దర్శించి బ్రహ్మానందమును బొందుటయే యగును.

ఇట్టి త్రిగుణాత్మకమయమైన యీశ్వరుని జగత్తులో
మానవుని దొలుత నాకర్షించునది సౌందర్యము. సౌందర్య
మయమైన యీ సృష్టిని దర్శించి ఆహ్లాద - ఆవేశ - ఆవేదన
లతో ప్రాక్తనమానవుఁడు పాడిన పాటయే సంగీత - సాహి
త్యము లయినవి; ఆడిన యాటయే నృత్త-నృత్యము లయినవి;
చేసిన కృత్యములే శిల్ప చిత్రములయినవి, ఇవ్విధముగా
ప్రాక్తనమానవునితో నారంభింపఁబడిన కళలే నేఁడు చతుష్షష్టి
కళలని పిలువఁబడుచున్నవి. మానవుఁడు దైవసంకల్పము
నకుఁ బ్రతిసంకల్పముతో సృష్టికిఁ బ్రతిసృష్టిని గావించు
చున్నాఁడు. అనఁగా దైవకళలకుఁ బ్రతికళలను సృష్టించు
చున్నాఁడు. సౌందర్యమే వీని లక్షణము. వీనిలోఁ గొన్ని
యుపయోగకళలు (Useful arts) కొన్ని లలితకళలు. (Fine
arts) ఉపయోగకళలు జీవితోపయుక్తములయినను బ్రహ్మా
నందతుల్యమగు నానంద మీయఁజాలవు లలితకళలు కేవల
మానందము కొఱకే. ఇవి యాత్మానందమునకే గాని జీవిత
సౌఖ్యమునకుఁ గాదు సంగీతము-కవిత్వము శ్రవ్యకళలు.
అనఁగా శ్రవణములే యీ కళల సౌందర్యమును నిర్ధారణ
చేసి యాత్మానందమును గలిగించునవి. చిత్రలేఖనము
శిల్పము దృశ్యకళలు. వీని సౌందర్యములు నిర్ధారణ
చేయునవి నేత్రములు పాకకళలోని సౌందర్యము ([illegible]
నాస్వాదించునది రసనేంద్రియము. సుగంధ - దుర్గంధము
లోని సౌందర్యమును కనుగొనఁగలుగునది ఘ్రాణేంద్రి
యము. మృదుత్వాఽమృదుత్వములను దెలిసికొనునది

త్వక్కు. ఇవ్విధముగా మానవుఁడు జ్ఞానేంద్రియముల ముఖమున కళాసౌందర్యము ననుభవించుచున్నాఁడు. జ్ఞానేంద్రియములు సక్రమముగాఁ దమ ధర్మమును నిర్వహింపనపుడు కళాసౌందర్యమును గ్రహించి యాత్మానందమును బొందలేఁడు. చెవిటివాఁడు సంగీతమాధుర్యమును, గ్రుడ్డివాఁడు చిత్రసౌందర్యమును గ్రహింపఁగలరా? పంచేంద్రియము లుండియుఁ గళాసౌందర్యమును ననుభవింపలేని మానవులు కొందఱు గలరు. అట్టివారికి సహృదయత్వము లేదని చెప్పవచ్చును. సహృదయత్వ మనఁగా 'ఆత్మవేదనోన్ముఖమైన యంతరంగము' కలిగియుండుట

దివ్యసౌందర్యము (Divine beauty) సహజసౌందర్యము Natural beauty) కల్పిత సౌందర్యము (Artificial beauty) అని సౌందర్యము త్రివిధము ఆధ్యాత్మికసంపన్నులు పరమాత్మను సాక్షాత్కరింపఁజేసికొని తన్మయత్వముతో బ్రహ్మానందమును బొందెదరు; ఆ పరమాత్మయే దివ్యసౌందర్యము. మనకు నిత్యము కన్పట్టు చేతనాచేతన పదార్థముల సౌందర్యము సహజసౌందర్యము. ఇది దైవసృష్టి. జీవితోపయోగమునకై, ఆత్మానందమునకై మానవుఁడు సృష్టించుకొనిన కళాసౌందర్యము కల్పితసౌందర్యము. సురూపియై జన్మించుట సహజసౌందర్యము. కన్నులకుఁ గాటుక, నొసట తిలకము, రెండు జడలు, జడలలో పూలు - ఇట్లు అలంకరించుకొనుట కల్పితసౌందర్యము. కల్పిత సౌందర్యముకంటె సహజసౌందర్యము, దానికంటెను దివ్య

సౌందర్యము-ఉన్నతోన్నతములు; ఉత్కృష్టములును. ఈతర తమభేదములను చక్కఁగా అవగాహనము చేసికొని సాహిత్యములోఁజూపఁగలిగినది పింగళిసూరన యొక్కఁడే కన్పించుచున్నాఁడు. సుగాత్రీ శాలీనుల కథ మన కందఱకుఁ దెలిసినదే కదా! శాలీనునకు సహజసౌందర్యమునం దొంత ప్రీతియో, తెచ్చి పెట్టుకొనిన యందమం దంత భీతియు వెగటును అందుచే వివిధభూషణమహిమకు వెక్కసపడి. యితఁడు భార్యను జేరఁదీయక పరాకుగా నుండెను వీరిద్దఱు తోఁటలోఁ గలిసిరి. 'తన్మతికి నట్టి సొంపులేగాని భూషణా లింపుగావు' అని సుగాత్రి తరువాతఁ దెలిసికొని, వాని యిష్టప్రకారమే ప్రవర్తించుచు దాంపత్యసుఖమనుభవించినది.

ప్రతికళలోను భావసౌందర్యము (Beauty of idea) రచనాసౌందర్యము (Beauty of expression) రూపసౌందర్యము (Beauty of form) పొడఁగట్టును. మచ్చునకీ పద్యముఁజూడుఁడు.

"తమిఁ బూఁదీఁగెలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూఁగునా
కోమకుం బ్రాయపు గబ్బి గుబ్బెతల యంఘ్రుల్చక్కఁగాఁ జాఁగి మిం
టి మొగంబై చనుదెంచు నవి గనుఁగొంటే దివ్యమౌనీంద్ర! నా
కమ్మృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్చాఁచుచులా గొప్పెడున్."

దీనిలోని భావసౌందర్య మత్యద్భుతము. తమ తమ పనులమీఁదఁ బ్రవేశించినట్టి నారద మణికంధరులు - రంభా నలకూబరులు, కలభాషిణి మొదలయిన వీరందఱు - ఈ పద్య భావముతో సంబంధము కలిగిన ముఖ్యపాత్రలే. కళాపూర్ణో దయ కథ యంతయు నీ పద్యముపై నాధారపడియున్నది. అర లీ పద్యమును మణికంధరునిచే జెప్పించుట యొక విశేషము. నారదునితోఁ జెప్పుట, యంతకంటె గొప్పవిశేషము. నారదుఁడు విని 'భళిరా! సత్కవివాదు' వని మణికంధరుఁ బ్రశంసించుట అన్నిటికంటె గొప్పవిశేషము.

కౌమరుంబ్రాయపు గబ్బిగుబ్బెతలను (ముఖ్యముగా కలభాషిణిని) జూచి 'నాకమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్చాఁచులాగొప్పిదున్' అని చెప్పుటచే మణికంధరుని భావము వేఱు. (ఆమె పొందును గోరుట) దానిని గ్రహించి 'భళిరా! సత్కవివాదు'వని మణికంధరుని ప్రశంసించుటలో నారదుని భావము వేఱు. (ముందు కథకవసరము గావున ప్రోత్సాహపరచుట) అంఘ్రులు బ్బక్కఁగాఁ జాఁగి మింటికి మొగంబై చనుదెంచు శ్రీవి కనుగొని 'వారల గోలాచల నోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యూహాదఁ దన్నంజను నట్లు మించె'నని కలభాషిణి బ్రశంసించుటలో దివ్యమునీంద్రుని భావము వేఱు. సౌందర్యగర్వముచే విఱ్ఱవీఁగు రంభను దవ్వులంజూచి రంభాగర్వభంగమునకే యీ ప్రశంస. ఆ మాటలను విని కనలి మనసొకింత చేసికొనిన రంభ భావము వేఱు. ఈ విధముగా నీ పద్య మనేక భావములతో ననేక

పాత్రలతోఁ గూడి కథాప్రారంభమునకు-విస్తృతికి బీజప్రాయ మయినది. ఇన్ని భావముల నొక్క పద్యములో నిముడ్చుట గొప్పవిశేషము. అదియే భావసౌందర్యము.

రచనాసౌందర్యము :- కొమరుంబ్రాయపు గబ్బి గుబ్బెత లాపక్కిలోఁ బూఁదీఁగెలఁ దూఁగుటుయ్యెలలలో పంతాలాడుచూఁగినటు చెవులకింపుఁగూర్చు సరళము, లలితమైన పదజాలముతో, రసవత్తర భావార్థములను గూర్చు శబ్దములతో రచన సాగినది. పూఁదీఁగెల తూఁగుటుయ్యేలలు- పంతాలాడుట - కొమరుంబ్రాయము - గబ్బిగుబ్బెతలు - మింటిమొగంబు - శివి - దివ్యమానీంద్రుఁడు - మృగనేత్రలు కయ్యమునకుఁ గాల్చాచుట - ఈ పదము లెంత సరళముగా సరసముగా నున్నవో చూడుఁడు. అసలీ పద్యములో నొక్క వ్యర్థపదముగూడఁ గనిపింపదు. వ్యర్థరహితమైన భావముతో- రచనతో- రూపమును జిత్రించినపుడే సంపూర్ణ సౌందర్యము పొడఁగట్టును

ఇదేభావమును మైకెలాంజలో Michelangelo అను పాశ్చాత్యకవి ( Beauty is the purgation of superfluities ) అను సూక్తిలో వెలువరించినాడు. నిష్ప్రయోజనము నిరర్థకములయిన రచనతో నిండియుండిన సౌందర్యము శూన్యము. తగినంతయే కాటుకదిద్దిన కన్నుల కందముగాని, యున్నదికదా యని కంటినిండఁబులిమిన అందమునకు బదులు అసహ్యము పుట్టునుకదా! కళాకారుఁ డనుచిత భావముతో, నిరర్థకమైన రచన సాగించిన కురూపమేగాని సురూపము రాదు.

రూపసౌందర్యము :- ఒక యుద్యానవనము. అందులోఁ బూఁదీఁగెల తూఁగుటుయ్యాలలు-ఆ యుయ్యాలలో అందమైన కన్యలు (గబ్బిగుబ్బెతలు) పోటీలతో - ఎంతో యెత్తున తూఁగుచున్నట్లు మన నేత్రములకు స్పష్టముగాఁ గన్పించుచున్నారు. సహృదయుఁడయిన పరిశీలకుఁ డీ త్రివిధసౌందర్యములను సమగ్రముగా సానుభూతితో అవగాహనము చేసికొనినపుడే హృదయము స్పందించి, యాత్మానందమును బొందఁగలుగుచున్నాఁడు.

ఆత్మాశ్రయ - పరాశ్రయముల సంధానము సౌందర్యము. మనోగతములయిన కళాకారుని భావములే కళలోఁ గన్పట్టునవి. కళలోని భావసౌందర్యమును దెలిసికొనుటయన-తత్కళాకారుని ఉత్కృష్టభావములను దెలిసికొనుటయే యగును. కళాకారుఁడు నిజహృదయ జనితమైన యుత్కృష్ట భావసంచయముచేఁ బరసాధన సంపత్తుల (కలము, కుంచె, ఉలి మొదలగు) సహాయముతో రచనసాగించి రూపమునుదిద్దును. కళాపరిశీలకుఁడు రూపమును జూచి, రచన నధిగమించి, కళాకారుని భావముల నందుకొనఁగల్గును. అప్పుడే యాత్మానందము

సౌందర్యము మరెక్కడనో లేదు. పరిశీలకుని ఆత్మయందే యున్నది. ( Beauty exists not in the world but in the beautiful soul-Fichete ) ఆత్మసౌందర్యము గల వ్యక్తికిఁ బ్రతివస్తువు సుందరముగనే కన్పట్టును దీనినే

వస్తువస్తుకూడ నిట్లు తేటపరచినాఁడు. The beauty that never was on sea or land, meaning that it was supplied by the observer నిజముగా సముద్రము లో అందములేదు. లేకపోయినను పరిశీలకుని సుందరాత్మ కది సుందరముగాఁ గన్పట్టుచున్నది. ఒకే వస్తువు కొందఱికి సుందరముగ గోచరించి యానందమును, మఱికొందఱికి నసంతృప్తిని గలిగించుటయుఁగలదు. ఆత్మసౌందర్యము లేని వ్యక్తికి, జ్ఞానేంద్రియములు సరిగాఁబనిచేయని వ్యక్తులకు నసంతృప్తిని గలిగింపవచ్చును. ఒకొక్కప్పుడు పరిశీలకులు లాక్షణికులు గీచిన వలయము లోపలనే తమ దృష్టిని ప్రసరింపఁజేయుటచే కళాకారుని భావసౌందర్యమును సమగ్రముగాఁ గాంచలేకపోవచ్చును.. ఆత్మసౌందర్యము గల పరిశీలకులకు లాక్షణికుల సహాయ మనవసరము.

Beauty uttracts people as the sun attacts the planet - Adam Muller· సూర్యుఁడితర గ్రహముల నాకర్షించునట్లు సౌందర్యము మానవాళి నాకర్షించును. స్త్రీపురుషులు భూషణాదులతో నలంకరించుకొనుట, యన్యోన్య మాకర్షించుకొనుటకొఱకేగదా! ఇట్టి సౌందర్య దిదృక్ష - పశుపక్ష్యాదులలోను గన్పట్టును. నాగస్వరమును విని నాగులు తన్మయత్వముతో ఆడుట, ఆ స్వర సౌందర్యమును గాంచియే. గిజిగాఁడు చక్కఁగా గూఁడు నల్లుకొనుట సౌందర్య దిదృక్ష చేతనే గదా!

మానవ కల్పితమైన కళలోఁ గన్పట్టు సౌందర్యమును మానవుఁడు క్రొత్తగా సృష్టించుచున్నాఁడా! లేదు. ఆ సౌందర్యము సహజసౌందర్యమున కనుకరణమే. ( Art consists in imitating the beauty of nature - Batteux) కళాసౌందర్యము స్వల్పకాలములో ననంతజ్ఞానము నమితానందము నీయఁజాలును. ఒకచిత్రమునుగాని శిల్పమునుగాని గాంచినపుడు డా కొద్దికాలములో నెంతజ్ఞానము నెన్నియూహాలు కలుగుటలేదు.

సౌందర్యము విలువ పరిశీలకుని యాశక్తి, ఆత్మసౌందర్యములమీఁద నాధారపడి యున్నది. కొందఱికిఁ గురూపిగాఁ గనుపించన వ్యక్తికోసమే మఱికొందఱు ఆత్మార్పణము చేసిన ఘట్టములను మన మెన్నింటిని జూచుటలేదు. కోకిల గానము కాకికి రుచించునా? కాకిపిల్ల కాకికి వెగటా? లోకమున సౌందర్యములేఁది మానవుఁ డొక్క నిమిషమునుకూడ జీవింపఁజాలఁడు. జీవితమునకు సంతృప్తి, యాత్మానందము నిచ్చు సౌందర్యము లేనిది మానవుఁ డెంతకాలము జీవింపఁ గలఁడు? పశుపక్ష్యాదులు నంతే. సౌందర్యమునఁగా నిచ్చట కేవలము దృశ్యసౌందర్యము కాదు. సర్వేంద్రియములకు సంబంధించు సర్వకళాసౌందర్యము.

కళాకారునియు పరిశీలకునియు నాత్మ లన్యోన్యము సంభాషించుకొనునట్లు చేయుటయే సౌందర్యముయొక్క యుద్దేశము కళాకారుఁ డే స్థితిలో నున్నాఁడో, పరిశీలకుఁ గూడ

నా సిత్తకిఁదెచ్చునది నిజమైన కళాసౌందర్యము. తన యేడ్పులతో ప్రేక్షకుల నేడ్పించుట-నవ్వులతో నవ్వించుట-సంతోషముతో సంతోషపఱచుట, నటునియుద్దేశము. అదియే సరియైన కళా సౌందర్యము నటుఁ డేడ్చునపుడు ప్రేక్షకులు నవ్వుట - నవ్వినపుడు ఏడ్చుట, కళాసౌందర్యమునకు నిదర్శనము కాదు. ఏయేభావములను అనుభూతులను కళాకారుఁడు పొందునో ఆ యా భావములను అనుభూతులను ప్రేక్షకుఁడు పొందవలెను.

ప్రకృతిలోని రహస్యములను వెలికిఁదెచ్చి చూపునది సౌందర్యము. (The beautiful is a manifestation of secret laws of nature - Emerson) ఆ సౌందర్యము నాధారముగాఁ గొని మానవుఁడు ప్రపంచమును పరిశీలించి యాత్మానందమును బొందుటయేకాక దైవసంకల్పమునకు భాష్యకారుఁ డగుచున్నాఁడు. మానవజీవితోద్దేశము పరమాత్మను దర్శించి బ్రహ్మానందమును బొందుటచేగదా! అట్టిది కళాసౌందర్యముచే సాధ్యము. బౌద్ధయుగమున జనించిన కుడ్యగతశిల్పములు చిత్రములు పరమాత్మను సాక్షాత్కరింపఁజేసికొనుటకు సృష్టించినవేగదా!

ఎమరన్స ఉద్దేశములో సౌందర్యము-అనేక విధములు: నడవడిలో- నాజూకులో- మాటలో- పాటలో- ఆలోచనలో- ఆత్మలో-నీతిలో-నియమములో ఇట్లు మానవుఁడుచేయు ప్రతి

విషయములో సౌందర్య మున్నది. కళలో సరసత్వములేని సౌందర్యము ఎఱలేని గాలమువంటిది. (Beauty without grace is the hook without the bait - Emerson ) ఎఱలేని గాలము మత్స్యములను ఆకర్షించునా ? లేదు. సరసత్వము లేని సౌందర్యమును నంతే. విభావానుభావసాత్త్విక వ్యభిచారీభావసంయోగమున పర్యవసించు రసస్వరూపము, ఒక సుందరకళాఖండమును గాంచిన వెంటనే పెల్లుబికి ప్రవహించె నేని అది సంపూర్ణసౌందర్యరాశియని చెప్పవలెను.

సౌందర్యమునకు విలువ దెచ్చునది కేవలము బాహ్య సౌందర్యమే కాదు. దానియంతః సౌందర్యమునుగూడ. చిత్రములో నణఁగిమణఁగియున్న భావసౌందర్యమునుగూడ గణింపవలెను. సంగీతము శ్రావ్యముగ నున్నదనుటే కాదు ఆసంగీతములోని భావసౌందర్యమునుగూడ గుర్తింపవలెను. Burke, Be-Bouello అనువారలు ప్రపంచప్రసిద్ధిఁ జెందిన వక్తలు. వీరిలో సౌందర్యము మచ్చునకైనఁగన్పట్టదు. ఒకరిది మొద్దుమొగము. వేరొకరిది యెద్దుమొగము. అందుచే వీరిని సౌందర్యహీను లనదమా? లేదు. వీరిలోఁ గనిపించునట్టి మేధాశక్తిని, అతిసూక్ష్మగ్రహణశక్తిని సంభావనాచాతుర్యమును గూడ విలువ కట్టవలయును. వీరెంత వికారముగా నున్నను వీరిని జూడక నిలువఁజాలని స్త్రీ పురుషులెందరో యుండి యుండవచ్చును. "with the physiognomy of an ox, he had the perspicacity of an engle" చూచితిరా

ఈ సూక్తి ( Cardinal de - Rets ) కార్డినల్ డిరెట్జ్ అను నతడు ప్రసిద్ధి గాంచిన (De-Bouillon) డిబొల్లన్‌ను గుఱించి చెప్పినది. కొందఱు బాహ్యసౌందర్యమునకే ముగ్ధులయ్యెదరు. మఱికొందరు కురూపులయినను ఆ కురూపులలోని అంతః సౌందర్యమునే ప్రేమించి తనివి చెందక వారికి దాసానుదాసులుకూడ నయ్యెదరు.

జీవితములోఁ గొంగ్రొత్త భావముల రేకెత్తించుట కళాకారుని యుద్దేశము. అదియే నిజమైన కళ. అదియే జీవితమునకొక సౌందర్యము. ఆ సౌందర్యమే నూతనోత్సాహము కలిగించునది ఆడిన యాటను, పాడిన పాటను, గీచిన గీతను మఱల ననుకరించుట జీవితాభివృద్ధికి నిరోధకము. అది పురోగమింపని శకటము వంటిది. నవనవోన్మేషమై, శతధా పురోగమించు కళాసౌందర్యము జీవితమున కొక జ్యోతివంటిది. అదియే జ్ఞానమయము. అది లేనినాఁ డంధకారమయ ప్రపంచమే.

జీవనోపాధికై సృష్టించు కళలలో సౌందర్యము మృగ్యము. భర్తచే హృదయ పూర్వకముగా ప్రేమింపఁబడు లలనామణికి. అలంకరణములతో నేమి పని? అట్టి లలనామణివంటిదే నిజమైన కళ. ఆ కళలోనే సంపూర్ణ సౌందర్య ముట్టిపడుచుండును. కృత్రిమ కళాసౌందర్యము వేశ్య వంటిది, (Real art like that wife of an affec-

tionate husdand, needs no ornaments But Counterfeit art, like a prostitute must always be decked out - Leo Tolstoy) దంపతుల యనురాగాహ్లాదములకుఁ బరిణామము సుపుత్రప్రాప్తియైనట్లు, కళాకారుని భావావేశమునకు ఫలితము కళాసౌందర్యము. వేశ్యకు ఫలితము ధనమే

కావున మానవుఁడు నిజమైన కళలను సృష్టించి నిజమైన సౌందర్యము నారాధించుట వాని పురోగమనమునే సూచించును. వాని జీవితము వినూత్నజ్యోతులతో విరాజిల్లును. జ్ఞానము ప్రసన్నమగును. అప్పుడే మానవాభ్యుదయము - దేశసౌభాగ్యము.



# "కవిత్వము - సంగీతము"

కవిత్వసంగీతములు లలితకళలలో నుత్కృష్టమైనవి. ఈ రెండింటి ప్రయోజన మాత్మానందము. ఆత్మానందము హృదయార్ద్రితం జెందినపుడే కలుగును.

ప్రాక్తనమానవుండు తా ననుభవించిన సుఖదుఃఖముల నభివ్యక్తీకరించుట కెపు డభిలషించునో, ఎపుడు వ్యక్తపఱచునో అపుడే కవిత్వ ముత్పన్నమైనది.

ఆనందముతో వాని స్వాంత ముఱ్ఱూత లూఁగినపుడు, దానిని వ్యక్తీకరించుచు నొక పాట పాడును. ఆ పాట కనుగుణముగ పాదన్యాసము జరుపును ఆ పాదన్యాసమున కనుగుణముగ కరన్యాసము చేయును. అట్లు నృత్త-నృత్య-గాన విక్షేపవిద్యలతోఁగూడినదే సంగీతము.

కావున కవిత్వ సంగీతము లు రెండును కవల పిల్లలవలె ఏకకాలసంభూతములు. కవిత్వము తాళలయానిత్వమగు గీత సాహచర్యమును వదలినపుడు గద్యముగ మాఱును. అట్లే సంగీతము కవిత్వసాహచర్యమును విడిచినపుడు యంత్రగాత్రాలాపనగ మాఱును. నాట్యము, కవిత్వ సంగీతముల మైత్రిని

వదలినపుడు 'కథాకళి' మున్నగు మూగ నాట్యములుగ మారును.

నిశితము-నిర్భరమునౌ మనోభావము లెప్పుడును నిరాటంకముగ తాళలయాత్మకమగు భాష (Rhythmical language) లో నుప్పొంగుచుండును. అట్టి మనోభావములను వాల్మీకి యనుభవించుటచేతనే కిరాతుని శపించినపుడా శాపము ఛందోరూపమున వెల్వడినది.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీః సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్"

ఈ శ్లోకమే మన కవిత్వమునకు శ్రీకారము. కిరాతుని క్రూరత్వము హృదయమును ద్రవింపఁజేసినది. వాని హృదయమును నింపి నిర్భరత్వమును బొందించిన నిశితభావ మీకోపము. ఆ మహానుభావుఁ డాకోపము నాఁపలేకపోయినాఁడు. శోకభరితుఁడై శపించినాఁడు, ఆ శాపమే ఛందోరూపమున శ్లోకమైనది.

అనాలోచితముగ అనాయాసముగ నిర్భరభావపరిపాకముచే జనించు కవిత్వము, స్మరణకారణముచే ఆలోచనాపూర్వకముగఁ గల్పించు కవిత్వముకంటె వేవిధముల నుత్తమము, అట్టి కవిత్వమునం దెక్కువ గీతి మాధుర్యము గోచరించును. కావుననే కార్లైలు 'గీతిమాధుర్యమును గలిగించు భావ సంపదను గవిత్వ' మనెను. (Poetry we will

call musical thought - carlyle) ఎడ్గర్ ఎల్లాన్ పో 'తాళలయాత్మకముగ సృష్టింపఁబడు సౌందర్యమే కవిత' యని నాఁడు. (It is the rhythmic creation of beauty- Edgur Allan poe.) సౌందర్య మనఁగా రచనా సౌందర్యము. 'రమణీయార్థముల ( Beautiful ideas ) తో రాణించు శబ్దసౌందర్యము కవిత్వ'మని యర్థము. ఈ భావమునే మన లాక్షణికులు 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య' మ్మని వ్యక్తపఱచినారు శబ్దసౌందర్యము మృదుమధుర మంజులగానయోగ్య మగునుగదా!

మొదట - ఈ కవిత్వ మాశువుగా నుండెడిది. కాని లక్షణము మాత్ర ముండెడిది కాదు. లిపి పుట్టిన తరువాతనే కవితాలక్షణ ముత్పన్నమైనదని చరిత్రకారుల యూహ. సిశితభావపరిపుష్టితోఁ బరువిడు మహనీయుల కవితాకన్య అనాథయై గాలిలో రూపుమాసి పోవుచుండుటచే, నామెకొక శాశ్వతరూప సౌందర్యమును జిత్రించుటకై సల్పిన ప్రయత్నమే లిపి. కాల శకటముపై నజ్ఞానావస్థనుండి విజ్ఞానావస్థకుఁ జేరుచున్న మానవుఁడు క్రమముగాఁ బ్రతికళకు లక్ష్య లక్షణములను సాధించినాఁడు.

ఏ కళయు సంగీతమంత శీఘ్రముగ నిరవధికముగ హృదయమును ద్రవింపఁజేయలేదు. సంగీతశ్రవణమున హృదయగ్రంథి విచ్ఛిన్నమై ద్రవించి యానందముతో

విస్తృతిఁ జెందును. అపు డిహమును మఱచి యలౌకిక మైన బ్రహ్మానందమును బొందును. సంగీతమువలన నెంత శీఘ్రముగ తన్మయత్వము కలుగునో - అంత శీఘ్రముగ హృదయాబ్జము సముత్కుళిత మగును. కవిత్వమున నట్లు కాదు కవిత్వమున రసమయజ్ఞానమును మఱచిపోలేఁడు. రసజగత్తులో లీనమై నిరుత్తరుఁడై నిరుపమానమై శాశ్వత మైన బ్రహ్మానందమును బొంద నుద్యుక్తుఁ డగును. సంగీతము విన్నంతసేపుమాత్రమే రసజగత్తులో తన్మయభావము కలుగును. అది మానినంతనే ఆ రసజ్ఞానము మటుమాయ నగును.

కవిత్వము ప్రతిసృష్టిని బ్రదర్శించును సంగీతమున కా శక్తి లేదు. కవిత్వము లేని సంగీతము వలన దైవ సాక్షాత్కారము కలుగుట దుర్లభము. కాని సంగీతము లేని కవిత్వము వలన దైవదర్శనము కలుగవచ్చును. ఇక - కవిత్వ సంగీతములు రెండును ఉన్నచో బ్రహ్మసాక్షాత్కార మతి సునాయాసము. త్యాగయ్య సంగీతము వలన శ్రోతలకు రామసాక్షాత్కారము, క్షేత్రయ్య పదములవలన శ్రీకృష్ణ పరమాత్ముని సందర్శనము, జయదేవుని గీతములవలన గోవిందుని కమదర్శనము, పురందరదాసుని కీర్తనలవలన దైవానుభూతి కలిగినదన్న, అట్టిభాగ్యము శబ్దసహకారమునుబట్టియే జరుగుచున్నది. కాని కేవలము సంగీతమువలనఁ గాదు. శబ్ద సహకారభాగ్యము వలననే కవితా లక్షణము సార్థకమగు చున్నది. కవితయందలి తాళలయాన్వితమే ఛందస్సు.

కవిత్వ - సంగీతములు శ్రవ్యకళలు. అనఁగా - ఈ కళల సౌందర్యమును దర్శింపఁగలుగునవి శ్రవణములు. వాని రూప సౌందర్యమును జతిగ్రించుకొని కళాధర్మమును గాంచఁ గలుగునది హృదయము. వాని యుత్తమనీచస్థితిగతులను నిర్ణయించి చెప్పునది బుద్ధి. బుద్ధివికాసములేని మానవుఁడు దర్శనముతోనె తృప్తిపడును. బుద్ధివికాసముగల వ్యక్తి కళను బరిశీలించి కళాసత్యమును సహృదయుల కందించును. అతనినే మనము కళావిమర్శకుఁ డందుము. కళాకారుని భావములను దత్కళాద్వారమున గ్రహింపవలయుననిన పరిశీలకునకుఁ గొంత కళామయజ్ఞాన మవసరము. కవితావిమర్శకున కుండవలసినంత నిశిత జ్ఞానము సంగీతవిమర్శకున కవసరము లేదు. కవిత్వమును సంగీతమును వోలె విమర్శించుట దుర్లభము. శబ్ద-అర్థ-పాత్ర-రసౌచిత్యముల నెఱిఁగి, కవితా ప్రపంచములోఁ గాలు పెట్టిన వాఁడే కవిత్వమును విమర్శింపఁ గలుగును. బధిరుఁడు కానిచో సంగీత మాధుర్యా మాధుర్యములను గ్రహింపవచ్చును.

గీతమును మృదుమధురముగా నాలాపించుట సంగీత ధర్మము. అవ్యక్తమధురగీతి నంతర్వాహినిగా వ్యక్తపఱచుట కవితాధర్మము. ఈ రెండింటి కన్యోన్య మైత్రిని గలిగించునది తాళ లయాత్మకమగు శబ్దమాధుర్యము. శబ్దమాధుర్యముగల వసుచరిత్రలోఁ జక్కఁగాఁ బాడుటకు యుక్తములైన పద్యము లెన్నో యున్నవి. ఈ క్రింది పద్యమును

జూడుఁడు. కమాచీరాగము-రూపక తాళములోఁ బాటగాఁ బాడవచ్చును,

మెఱుఁగొప్పు నెఱిగొప్ప నెఱగప్పు తఱిగప్పు
జలదమాలిక చొప్పు దెలుప లేదొ
బలు వాలుగల నేలు తెలివాలుఁగను డాలు
కలువపూఁదెరమేలు దెలుప లేదొ
నలువైన కలలీనఁ గల లేనగవుసోన
కలశాబ్ధి తెరమేన నిలుప లేదొ
కనకంపు ననసొంపు కడ నుంపు రుచి పెంపు
పసిఁడి తీఁగెల గుంపు మెసఁగ లేదొ

ప్రాణసఖులార నెయ్యంపు టలుకఁబూని
యేల యీ బాల యీ వేళ నీ విశాల
యవనికాభ్యంతరంబున కరిగె ననఁగ
ననుఁగు నెచ్చెలి మఱియు నెయ్యమునఁ జేరి.

ఇట్లె గోన బుద్ధారెడ్డి రంగనాథరామాయణమును గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమును 'తోలుబొమ్మ' లాటవారు దరువులతో డెందమున కానందము కలుగునట్లు పాడుట వినియే యుందుము అప్పకవి, జయదేవుని గీతగోవిందమును సంగీత కావ్యముగఁ బరిగణించుటను బట్టికూడఁ

గవిత్వసంగీతములకున్న సన్నిహితమైన పరస్పరమైత్రి ద్యోతక మగుచున్నది.

కవిత్వమునకుఁ బ్రాణము ఛందస్సు శబ్దసృష్టి ఛందోమూలమున శ్రుతిలయబద్ధమగును. లలితకళ లన్నిఁటికి శ్రుతిలయలు ( Harmony and Rhythm ) ప్రధానమైనను కవిత్వసంగీతములందు, ముఖ్యముగా సంగీతమందివి ప్రస్ఫుటముగా గోచరించును. కవిత్వమున గణము తప్పిన శ్రుతిలయలు తప్పును. గీతిమాధుర్యము వ్యర్థమగును. అనుప్రాసాది శబ్దాలంకారములు గల గద్యముకూడఁ దాళలయాత్మకమగు గీతిమాధుర్యమును గలిగించును.

భాగవతమున రాసక్రీడావర్ణనావసరమునఁ గన్పట్టు గద్యకు గీతిమాధుర్యము కలుగుట శబ్దసౌందర్యము చేతనే గదా! కాని ఛందోమూలమునఁ గలిగిన కవితయందలి గీతిమాధుర్యము గద్యలోఁ గన్పట్టు గీతిమాధుర్యముకంటె శ్రేష్ఠతరము సుందరతమము.

శైవకవులు తమ మతవ్యాప్తికై కవిత్వము నూఁతగాఁ గొనుటలో ముఖ్యోద్దేశము ఆ కవితలోని గీతి మాధుర్యము ప్రజల నాకర్షించుటయే.

మార్గ కవిత్వము మార్గసంగీతముల వోలె, దేశికవిత, దేశీయసంగీతములు వికసిల్లినవి. సంస్కృత భాషలో

సంస్కృత ఛందోబద్ధమై విఁ సిల్లునది మార్గ కవిత్వము. శార్దూలమత్తేభాదు లిట్టివి భరతముని ప్రోక్తమగు సంగీతము మార్గ సంగీతము దేశ్యభాషలో దేశీయ ఛందస్సులో ప్రజల కవగతమగు పద్ధతిలో వ్రాయఁబడినది దేశికవిత. ద్విపదలు - త్రిపదలు - షట్పదులు - అష్టపదులు - రగడలు - అక్కరలు మున్నగునవి యీ జాతికిఁ జెందినవి దేశీయమగు మాత్రా ఛందస్సులో జాతీయాచారవ్యవహారములను ప్రతిబింబించు చక్కని జాతీయములతో గానయోగ్యమై రస భరితమై మైమఱపించునది దేశీయ సంగీతము. దీనినే పద కవిత్వ మనవచ్చును. తుమ్మెద పదములు ప్రభాత పదములు వెన్నెలపదములు జోల పాటలు లాలి పాటలు ఏల పాటలు మొదలగునవి ఈ జాతికిఁ జెందినవి. తెలుఁగుభాష కున్న శబ్దసౌభాగ్యము మఱేభాషలోను లేదు అందువలననే తెనుఁగు పాటలలో తేనె సోనఁవోలె తియ్యఁదన ముబుకు చుండును.

కవిత్వసంగీతములు రెండును జరకళలు. (Dynamic arts) తక్కినవి స్థిరకళలు. చరకళ లనుభవించుటకు వానితోఁబాటు మన మనోవ్యాపారములు వాని ననుగమింప వలయును. స్థిరకళలకు భౌతికద్రవ్యాపేక్ష (Help of material objects) యధికము చరకళలకుఁ దదపేక్ష స్వల్పము. భౌతిక ద్రవ్యాపేక్షలేని కళ యున్నతోన్నత మైనదని పండితుల భావము. చిత్రలేఖనము విగ్రహశిల్పముల కున్న

ద్రవ్యాపేక్ష (రంగులు - కుంచె - టాయి - లోహము - శిలి- సుత్తి మొ॥) కవిత్వసంగీతములకు లేదు. సంగీతమునకు భౌతిక ద్రవ్యాపేక్ష సూక్ష్మతరము. మానవగాత్రమే యిందు ప్రధాన ద్రవ్యాపేక్ష. (సాధనము) కవిత్వమున కసలు లేనే లేదు. మానసిక వ్యాపారమే ప్రధానము. అనఁగాఁ గవితా సృష్టికిఁ బునాదియగు భావవ్యాపార మాధారభూతము మనో వ్యాపారములు రూప రహితమైనవి. కావుఁ భౌతిక సంపత్తి లేని మనోభావసంపత్తిచే సృజింపఁబడు కవిత్వము శ్రేష్ఠతర మయినదని చెప్పుదురు.

కవికి నిశితభావవ్యాపార మెంత ముఖ్యమో, గాయ కునకు మృదు మధుర మంజుల గాత్ర మంత ప్రధానము. గాత్ర సౌభాగ్యము లేని గాయకుఁడు లక్షణము తెలిసియు సహృదయుల రంజింపఁ జేయుట ఎంత దుర్లభమో భావ సౌభాగ్యము లేని కవి కవిత్వము వ్రాసిన నంతియే జరుగును. కవికి సహజముగా గీతిమాధుర్యము తెలిసియుండ వచ్చును. కాని గాయకునకుఁ గవిత్వ మరయుట దుర్లభము. కవికి సంగీతము తెలిసి యుండినచో సుమమునకు సౌరభమునోలె, వాని కవిత్వము మిక్కిలి రాణించును,

ఆధ్యాత్మికతత్త్వవిచారము శబ్దసాహచర్యము లేని సంగీతమున లభించుట దుర్లభము. దానిని కవిత్వమున నను స్యూతముగా నిరతిశయముగాఁ బడయ వచ్చును. పరమా

త్మను గాంచి బ్రహ్మానందమును బొందవచ్చును. కవిత్వ ప్రధానమగు సంగీతమున నిట్టి పరమాత్మ సాక్షాత్కారము మిక్కిలి సులభము.

కవిత్వమున పాత్రలు సజీవములు. చరాచరములకు జీవముపోసి వానికి శబ్దసౌభాగ్యముతో రూపసౌందర్యమును జిత్రించువాఁడు కవి. సంగీతమున పాత్ర ప్రయోజనము గాని రూపచిత్రణముగాని యుండదు. హృదయమును ద్రవింపఁజేయు గీతిమాధుర్యమే యిందు ప్రధానము. సంగీతముచేఁ జంద్రకాంత శిలలు కఱగి నీరగుట, వృక్షములు, వర్ధిల్లుట మున్నగు అనేకనూతనవిషయములు పూర్వగ్రంథములలో వార్తాపత్రికలలోఁ దఱచుగాఁ జూడఁగల్గుచున్నాము. అంతే సంగీతమునకున్న గొప్పతనము. కవిత్వము జడమునకు జీవము పోసి నడిపించి మురిపింపఁగలదు.

కవిత్వసంగీతములు రెండును వాగర్థముల వంటివి. ఒకదాని నొకటి వదలి యుండనేరవు. ఛందోమూలమున కవిత్వమునకు శ్రుతిలయలు లభించును. శ్రుతిలయ లుండిన గీతిమాధుర్య ముండును, కాఁబట్టి యివి రెండును బరస్పరాశ్రయములు.

సంగీతములోని హృదయద్రవీకరణశక్తి, చిత్రలేఖనమందలి రూపసౌందర్యము, విగ్రహశిల్పమునందలి శిల్ప

సౌభాగ్యము, కవిత్వమునఁ బ్రతిబింబించును. అంతియే కాదు. కవిత్వము సర్వకళాసౌభాగ్యమునకు నిలయము. కావున సర్వ కళలలోఁ గవిత్వ ముత్తమోత్తమము.

కవితారాధకులు ఋషితుల్యులు. కావుననే 'నాఋషిః కురుతే కావ్యమ్' అనినారు పెద్దలు. వారు సృష్టికిఁ బ్రతి సృష్టిని జేయఁగల సమర్థులు. వారి వాక్కు లమృత తుల్యములు. వారాగ్రహించినచో శాపవాక్కులగును. ఈ రెండును సర్వకాల దేశ పాత్ర ప్రయోజనమై శ్రేయోదాయకమై పరఁగు కళలు. సంగీతమునకు సృజనాత్మకమగు ధర్మము లేదు. కాని ఏ కాలములోనైన ఏదేశములోనైన సర్వ ప్రజలు విని యానందించి, యవగాహనము చేసికొనఁగలిగినది సంగీతమును మాత్రమే. (Music is the universal language of mankind - Longfellow) కాని కవిత్వ మర్థమగుట దుర్లభము. దానికిఁ గొంత పరిశ్రమ ప్రయత్నము లవసరము.

సంఘమునకు నవచైతన్యము కలిగించి, ఉత్సాహముతో ముందునకు నడిపించుటకీ రెండు కళలు ముఖ్యసాధనములు. కవిత్వ సంగీతములు వెల్లివిరిసినపుడే సంఘములో సంస్కృతీ నాగరికతలు జనించి దేశ మభ్యున్నతిఁ జెందును. కావున ప్రతిమనుజుఁడు కవిత్వ సంగీతముల నారాధించుట పరమాశయముగ గుర్తింపవలెను.

# "సాహిత్యములో సత్యభామ"

వాస్తవమునకు సత్యభామ యెట్లుండునో మనకు తెలియదు. కాని సాహిత్య సమీక్షకారులకు సత్యభామలో నేటి నాగరిక స్త్రీ స్వభావములు ధైర్యసాహసములు రసికత్వము చిలిపితనము సుస్పష్టముగా గోచరించును. దేశ-కాల-రాజకీయ పరిస్థితులలోఁ గవితాకన్య చెలిమి బలిమి కలిగి, వివిధ రూపములతో వర్తిల్లుట సహజము. గదా! అందు చేతనే భాగవతమున నొక విధముగను, హరివంశాదులలో మఱొక విధముగను, ప్రబంధాదులలో నింకొక విధముగను, సత్యభామ చిత్రింపఁబడినది. ఎందఱెన్ని విధములుగాఁ జిత్రించినను సత్యభామలోని సహజస్వభావము నాధారము చేసికొనియేగదా కవులు చిత్రవిచిత్రముగఁ జిత్రించినది! కృష్ణునకుఁ బదునాఱువేల యెనమండుగురు సతీమణు లుండఁగ నిట్లు చిత్రించుట మన కవులకు నొక్క సత్యభామయే దొఱికినదా?

ఆమెలో-అసదృశమైన సహజ సౌందర్యము - అలౌకికమైన యనురాగ మాధుర్యము అనంతమైన హృదయద్రవీకరణశక్తి యుండఁబట్టియే అపరావతారుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు విధేయుఁడై యామెపాదపద్మములకుఁ బ్రణమిల్లుట. ప్రణమిల్లుటయే కాదు. సత్యభామావామపాదతాడనముతో

'ధన్యోఽస్మి' 'ధన్యోఽస్మి' యనినాఁడు నంది తిమ్మనార్యుని పారిజాతాపహరణములో - అట్లే ప్రణయకలహములలోఁ బ్రియురాలి కర పాద తాడనములచేఁ గృతార్థులగు నాగరకయువకులెంతమందిని మనము నేఁడు గాంచుటలేదు ? అంతయును గాలమాహాత్మ్యము. కవివాక్కు సార్వకాలికముగదా ?

కృష్ణదేవరాయల కాలమునాఁటి సాంఘికవాతావరణమే సత్యభామావామపాదతాడనముచేఁ గృష్ణుఁడు ధన్యుడగుటకు మూలకారణము. ఈ విషయము మూలగ్రంథమగు సంస్కృతహరివంశమున గోచరింపదు. అందు శ్రీకృష్ణుఁడు రుక్మిణీ సమేతుఁడై యుండఁగా, 'కలహ భోజనుఁ డేతెంచి పారిజాత కుసుమము నీయ నద్దానిఁ దనకడనున్న రుక్మిణి కిచ్చితి ననియు, నందుచేఁ దన తప్పు మన్నింపవలయుననియు సత్యభామను గోరును. పారిజాతాపహరణములో కొంటె కృష్ణుఁడు సత్యభామ పాదములకు మ్రొక్కినట్లును ఆమె పతిశిరము నెడమకాలితోఁ బ్రక్కకుఁ దోచినట్లును గవి చిత్రించినాఁడు. అంతియేకాదు; అంతటి యపరాధమును శ్రీకృష్ణుఁడుక్షమించి, యోదార్చి కోరినకోర్కె నెరవేర్చినాఁడు. ఇందు వారి రసికహృదయ మవగతమగును. నాయికానాయకుల యన్యోన్యానురాగాతిశయము సహృదయమనఃఫలకములఁ జిత్రితమై కావ్యము రసపుష్టిఁ జెందినది. శృంగార వీరములకు నెలవైన రాయల యుగమున నిట్టి సత్యభామ వెలయుట విచిత్రము కాదు,

శ్రీకృష్ణదేవరాయలు తన ప్రియురాలు తిరుమలదేవి, తన యెడ ప్రణయాపరాధము కావింప నప్పటినుండి యమ్మగువమోము చూడనొల్లక కోపావిష్టుఁడై యుండఁగా, ఆ సతీ పతులకు సఖ్యము, గూర్చుటకై తిమ్మనార్యుఁ డీ కృతిని గావించెననియు, సంత నమ్మహిఁ జాని, కోపమును విడనాడి ప్రియసతి చెంతఁ జేరె ననియు నొక కింవదంతి కలదు. ఇది మన కప్రస్తుత చర్చనీయాంశము. ఏమయినప్పటికిఁ దిమ్మనార్యుని పసిఁడి గంటమున సత్యకు నెనలేని "రూపమున్మగని కూరిమియు' గౌరవములు గలిగినవి.

శ్రీకృష్ణపరమాత్మకు జగము లన్నియు లోకువై యుండ ఆతఁడు సత్యభామకు లోకువ. పట్టమహిషియగు రుక్మిణీదేవి యున్నదికదా ? ఆమెపై నింత గారాబ మున్నదా ? లేదు. కలలోననైన నవ్వులకైన సత్యభామ మాట జవదాఁటి యెఱుఁగఁడు (శ్రీమదాంధ్రభాగవతమున) శ్రీకృష్ణుఁడు లోక కంటకుఁడగు నరకాసురుని వధించుటకుఁ బోవు సమయమున

"దేవా! నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు సూడఁగోరుదుఁ గదా! ప్రాణేశ! మన్నించిన
న్నీ వెంటంగొనిపొమ్ము నేఁడు కరుణన్, నేఁజూచి యేతెంచి నీ
దేవీసంహతి కెల్లఁ జెప్పెదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్."

(భాగవతము)

అని సత్యభామ చాకచక్యముగాఁ బొగడినది. సామాన్యముగా నేనుగూడ వచ్చెదననిన అంగీకరింపకపోవచ్చును.

అందుచే సత్యభామ మధురమైన వాఙ్నైపుణ్యముతో 'దేవా! నీవా రాక్షస సంతతిని జీల్చి చెండాడు సమయమునఁ గన పఱచు, నీ ప్రావీణ్య పౌరుషాతిశయములఁ జూడఁ గుతూహల ముగానున్నది. భవదీయ దేదీప్యప్రతాపోన్నతులఁ జూచి, వచ్చి నీరాణులందరితోఁ జక్కఁగఁ జెప్పెద'నని పరోక్షముగఁ బొగడినది. పొగడ్తలకు లొంగనివా రెవ్వరు? అంత ప్రాణ వల్లభుకు శ్రీకృష్ణుఁడు

"కమల కల్హార కుసుమ సంఘములు గావు
చటుల రిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య! నీ వేడ? రణరంగమున మేడ?
వత్తు వేగమ నిలువుము వలదు. వలదు." (భాగవతము)

అని ఆటంకపఱచును. కాని సత్య అంతటితో ఆఁగి నదా?

"దానవులైననేమి? మఱిదైత్య సమూహములైననేమి? నీ మానితబాహాదుర్గముల మాటున నుండఁగ కేమిశంక? నీతో సరిదెంతు" నంచుఁదిరిగి పొగడినది. భగవానుఁడు స్తోత్ర ప్రియుఁడు గదా? సత్యను వదలి క్షణముసేపు ఓర్వలేని శ్రీకృ ష్ణుఁడు 'సరే' యని సత్యభామను కరకమలముల గ్రుచ్చి యెత్తి తోడ్కొని గరుడారూఢుఁడై గగనమార్గమునఁ జనును. మహాభయంకరమైన రణరంగమునకు - అందును రాక్షస రణరంగమునకు సత్యభామ పోవ నుద్యుక్తురాలగుట

కేవలము శ్రీకృష్ణుని ప్రతాపోన్నతులను ప్రావీణ్యమును గాంచుటకుఁ గాదు. అది కేవలము మాయాకృష్ణుని ఒప్పించుట కాడిన మాటలు. అసలు రహస్య మేమన శ్రీకృష్ణుని జూడక వాని వాగమృతమును గొనక వాని సరసమును గ్రోలక క్షణముసేపుకూడ సత్య తాళఁజాలదు. ఆమెతలంపు నెఱింగినవాఁడు కనుకనే పై పద్యమున 'పత్తు వేగము నిలుపుము' అనెను. ఇందు వారి యన్యోన్య ప్రేమాతిశయము పేర్కొనఁ దగినది.

భాగవతకవులు సత్యాకృష్ణుల నలౌకికులైన శృంగార వ్యక్తులనుగా సృష్టించినారు. వీరినే దక్షిణాంధ్ర కవులు పచ్చి శృంగారముతోఁ బూజించినారు. ముక్కు తిమ్మనార్యుఁడు పాకము చెడని పద్ధతిలోఁ బసిఁడిలేఖిని సాగించినాఁడు. వీరిద్దఱి ప్రేమసత్యమును గ్రహించినవాఁడు కనుకనే దక్షిణాంధ్రకవియగు కామేశ్వరకవి తన సత్యాభామా సాంత్వనములో వారి వివాహ వేదనను జక్కఁగా వర్ణించెను. అది చదువుటకు వినుటకు వెగటుగా నున్నను, పచ్చిశృంగార మున్నను, ప్రేమ తత్త్వమును గుర్తించినవాఁడా కవియే యనవలెను. రవి కానని సత్యమును గవి కనునుగదా! సత్యాభామాకృష్ణుల కన్యోన్యము అనిర్వచనీయమైన గాఢానురాగ మున్నదని గ్రహించి తిమ్మనార్యుఁడా సత్యమును లోకమునకు వెల్లడి చేయుటకై సత్యభామచేఁ గృష్ణుని దన్నించినాఁడు. ఇట్టి కావ్యసంఘటనముల కానాఁటి రాజ

కీయ సాంఘిక వాతావరణము కొంత దోహదమైనను గొంత సత్యము లేకపోలేదు. నిప్పు లేనిది పొగ రాదు కదా!

నరకాసురుని వధించుటకుఁ బోయిన సత్యాకృష్ణులు నరకాసురుని వధించి వానిచేఁ జెఱఁబెట్టఁబడిన పదునాఱువేల కన్నియలను చెఱనుండి విడిపించి వారికి 'ధవళాంబరాభరణ మాల్యానులేపనంబులొసంగి యందలంబు లిడి వారలను, నరకాసురభాండాగారంబునం గల నానావిధంబులయిన మహాధనంబులను, రథంబులను తురంగములను ధవళంబులై వేగవంతంబులై యైరావతకులసంభవములైన చతుర్దంతదంతావళంబులను ద్వారకానగరంబునకుం బనిచి, దేవేంద్రుని పురంబునకుఁ జని యదితిదేవి మందిరంబు సొచ్చి, యా పెద్దమ్మకు ముద్దుసూపి, మణికిరణ పటల పరిభావిత భాను మండలంబులైన కుండలంబు లొసంగి, శచీమహేంద్రులచే సత్యభామతోడం బూజితుండై పిదప సత్యభామ కోరిన నందన వనంబుసొచ్చి పారిజాతమును హరి కేలం బెకలించి భుజగేంద్రారాతిపైఁ బెట్టి బయలుదేరుచుండ నింద్రుఁడీ విషయము దెలిసికొని, పద్మలోచను నొడ్డారించి యుద్ధంబు వచ్చిన నమరేంద్రాదుల నిర్జించి, తన పురంబునకుం జని సత్యభామతోఁ గ్రీడించుచు మహోద్యానంబున సంస్థాపించి' నట్లు భాగవతమునఁ గలదు.

శ్రీకృష్ణుఁడు పారిజాతమునకై పరమేశ్వరునిగూర్చి తపమొనర్చి వరము పొందినట్లు మూలమున నుండఁగా

కృష్ణుఁడు సత్యాసహితుండై పోయి, యమకేంద్రాదుల నోడించి పారిజాతము తెచ్చినట్లు తిమ్మనార్యుఁడు మార్చి నాఁడు. సత్యభామ ధీరోద్ధతిని కృష్ణునకు సత్యపైఁ గల యనురాగాతిశయ ప్రకాశనమే ముఖ్యప్రయోజనముగాఁ దలఁచి ముక్కు తిమ్మన్న యిట్లు మార్చియుండును.

కృష్ణుఁడు పారిజాతమును 'హస్తమున నుత్పాటించి లీలాగతిన్' గరుడస్కంధముమీఁద నిలిపి పయనమగు చుండఁగా నచ్చటి నందపాలురు.

"అట్టి సురతరువు నెఱుఁగక
చట్టపు మేలమునఁ గొంచు నరిఁగెడు మది నీ
కెట్టు జనియించె మరలం
బెట్టుము బలభేది విన్న మేలే నీకున్"

(పారిజాతాపహరణము)

అని కృష్ణుని నడ్డగించెదరు. అపుడు సత్యభామ చూచి నది. ఇంతలోఁ గృష్ణుఁ డేమో మాటలాడఁబోయినాఁడు. 'మీ రూరకొనుఁడు నేను మాటాడుదు'నని కృష్ణుని ఆఁపి నది. వెంటనే పైట సవరించుకొని దట్టి కట్టినది. విడిపోయిన వెండ్రుకలను గట్టిగా ముడివేసినది. ఇక చూడుఁ డా వీరవనిత యొక్క సాహసపుపలుకులు. అవి పలుకులు కాదు ములుకులు.

"వినుఁడు సురేశ్వరు వనపాలకులు! వార్ధిఁ
బొడమిన యీ దివ్యభూరుహమున
కిందాఁకఁ  గోరి యెవ్వ గ తె యింద్రుఁడు నెవ్వఁడు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించ నతఁడె చేసికొనుఁ గాక
తెక తేర యిదియేమి యొకరిసొమ్మొ
యిదె నాదు విభునిచే నీ వదాన్యసగంబు
నొడియించుకొని యేఁగుచున్న దానఁ

బలుకులేటికిఁ దా వీరపత్ని యేని
యీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవు నిటఁ బంపి సత్యభామావిధేయు
పలన మరలంగఁ గొనుట పో వాసితనము"

(పారిజాతాపహరణము)

ఇందు సత్యకు మగనిపైఁగల స్వాతంత్ర్యమే కాక, అట్టి ధైర్య సాహసములు శివి గర్వాతిశయము తక్కంగల పదు నారు వేల మేడుగురిలో నెవ్వరియందును గానము. శ్రీకృష్ణుఁడు 'సత్యభామావిధేయుఁ'డని వాని యెదుట నెంత యాత్మవిశ్వాసముతోఁ బలికినదో పరికింపుఁడు.

భాగవతమునఁగూడ నిట్టి నరకాసురవధసమయమున ఖగేంద్రస్కంధపీఠంబుపై సరోరుహాక్షుని ప్రక్క సంగర

కథాలాపములు వినుచు, సత్యభామ కలహంబునకు నరకాసురుఁడు గమకింపఁ దమకింపక విలోకించి సంభ్రమంబున
"వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై, భూషణ
శ్రేణిం దాల్చి, ముఖేందుమండలమరీచీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్"

(భాగవతము)

శత్రు సంహారమునకుఁ బతికంటె ముందు సతి లేచినిలిచినది. కేశపాశమును సవరించుకొని చీర గట్టిగా దట్టి కట్టి పాణిం బైట సవరించుకొని వీరసంభ్రమ కౌశయముతో విల్లుదాల్చి విజృంభించినది. భారతనారీమణులకు వీరత్వ ముగ్గుపాలతో అలవడును గాఁబోలు. సత్యను సమీక్షించినచో ఝాన్సీ లక్ష్మీబాయి, రాణీ రుద్రాంబ మున్నగు వీరవనితలు వెంటనే స్మృతిపథమునఁ బరఁగెదరు. సత్యభామయొక్క ధైర్య స్థైర్యములకు మెచ్చుకొని సమ్మదమున సరసల్లాపములతో – ఆ మోహనాంగుఁడు

"లేమా! దనుజుల గెలువఁగ
లేమా? నీ వేల కడఁగి లేచితి విటు రా
లే, మాను, మాన వేనిన్
లే, మా విల్లందికొనుము లీలం గేలన్".

(భాగవతము)

అని పలికి తన ధనస్సు నీయఁగా సత్యభామ,
"వీర శృంగార భయరౌద్ర విస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
విషువుఁ దొడుగుట, దివుచుట, యేయు టెల్ల
నెఱుఁగఁ గాకుండ నని సేసె నిందువదన"

(భాగవతము)

అహా! యుద్ధవిద్యలో సత్య కెంత నేర్పున్నది. వేయు బాణమునకుఁ, దీయుబాణమునకుఁ దెంపే లేదఁట. వీర శృంగార భయరౌద్రవిస్మయములతో మూర్తీభవించిన భామినివోలెఁ గనబట్టినది. ఇందువదన గదా! అందుచే శృంగారముకూడఁ దొణకిసలాడినది.

నాచనసోమన ఉత్తరహరివంశమున నరకాసురసంగర మధ్యంబునఁ గృష్ణుఁడు మూర్ఛిల్లి సేదదేరి సత్యనుజూచి యిట్లనుచున్నాఁడు

"అట్లు సేద దేఱి యరవిందనయనుండు
సత్యభామఁ జూచి చంద్రవదన!
శార్ఙ్గమింద నీవు సమరంబె కొనుదు
వవసరంబు వచ్చెననుచునిచ్చె"

అపుడు వీరలక్ష్మివోలె సత్యభామ సమరమున నసురులఁ దెగ

టార్చి ప్రకటితవైభవలక్ష్మినోలెఁ గన్పట్ట నామె చేసిన సంగరంబునకు సంతోషించి,

"చెలువ చెక్కుల నలకొన్న చెమటఁ దుడిచి
తరుణి నుదుటఁ బైకొన్న కుంతలము లొత్తి
రమణి కుచమధ్యమునకు హారములు దొలఁచి
పొలఁతి పయ్యెద కొంగుపైఁ బొందుపఱచి"

(ఉత్తర హరివంశము)

హరి యక్కామిని చేతివిల్లు గొని యేయఁ జొచ్చినాఁడఁట. పై పద్యములవలన యుద్ధరంగమునఁగూడ సత్యభామాకృష్ణుల ప్రేమాతిశయము; శృంగార లీలలు మనకు స్పష్టములగుచున్నవి. దీనినిబట్టి సత్యభామలో మోహనాకారుఁడయిన శ్రీకృష్ణుని ఆకర్షింపఁగల యేదో యనిర్వచనీయమైన విశేషమైనశక్తియుక్తు లుండితీరవలయును. లేనిచో పట్టమహిషి రుక్మిణి యున్నదికదా! ఆమెతో నింత చనవుగా సరసములాడుచున్నట్లు మనకుఁ దోఁపదు. ఆమెకుఁ గులమును రూపము న్మగని కూరిమియుం గలవు. కాని సత్యభామవలె మాయా గోపాలుని నాకర్షింపఁ గలిగినదా? ఆ కొంటె కృష్ణుని కొంగునఁ గట్టుకొని యమరపురికి కరిగి పారిజాతమును దెప్పించుకొని తన పెరటిలో నాఁటించుకొనఁగలిగినదా? పోనీ తక్కిన పదునాఱువేల యెనుఁగురిలో నెవ్వరికైన నింత శక్తి యున్నదా? లేదు. అట్టిచాతుర్యము, అట్టి మహాభాగ్యము

పొందఁగలిగినది సత్యభామ యొక్కతె కనుపట్టును. సత్యభామ యందచితోఁ జక్కని చుక్క; ఎల జవ్వని; వాక్చాతుర్యము మృదుమధురమైన వ్యంగ్య సంభాషణానైపుణ్యముగలది. వీర వనిత. జగములో ఆమెకు మంచి పేరు ప్రతిష్ఠ లున్నవి. కొంటె కృష్ణుని మెప్పింపఁగల చిలిపితనము అందములో రతీదేవిని మించునది ఇఁక జగన్మోహనాకారుఁడగు శ్రీకృష్ణుఁ డెందులకామెకు దాసుఁడు కాఁడు? మన మొక గృహిణి తోనె సదమదమగుచుండఁ గృష్ణునకుఁ బదునాఱువేల యెనమండుగురు సతులఁట.

"ఏ యే వేళల నే సరోజముఖి యే యే లీలలం గోరుఁ దా
నా యా వేళల నా సరోజముఖి నా యా లీలలం దేల్చి యే
చాయం జూచినఁ దానయై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుండయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురిన్"

(పారిజాతాపహరణము)

ఆహా! శ్రీకృష్ణుఁ డెంత రసికహృదయుఁడు. ఎంతశక్తిమంతుఁడు. ఇంతమందిలోను ముద్దుల మగనిని చెప్పుచేఁతలలో నుంచుకొను విషయమై రుక్మిణీసత్యలకే కొరకొరలు – రవరవలు జనించినవఁట. రవరవలేర్పడినంత మాత్రమున రుక్మిణి యదుకుల రాజన్యుని యదుపులో నుంచుకొనఁగలిగినదా? లేదు. ఆ శక్తి సత్యకే దక్కినది రుక్మిణిలో పెద్దముత్తైదువ పోకడలు శాంతి సహనములు పొడఁగట్టును. సత్యే

భామలోఁ గొంటెతనము గర్వము గన్పట్టును. ఎలజవ్వని కదా! కొంటెతనము గర్వము సహజముగా నుండిన నుండ వచ్చును.

నారదుఁడు తెచ్చిన పారిజాత కుసుమమును పద్మాక్షుఁడు పట్టమహిషియైన రుక్మిణీదేవి కీయ. సపత్నీమాత్సర్య మంతమందిలో నొక్కరికైనఁ గల్గినదా? ఒక్క సత్యభామకుఁ దప్ప.

"అందఱిలోనఁబెద్ద మహిమాన్విత రుక్మిణిగానఁ బూవు గో విందుఁడు దానికిచ్చెఁ దగవేయని ఓర్చిరి, సైఁచెఁగా ళింది, శమిం చె భద్ర. యపు లెమ్మని యూరడిలెన్ సదంత లోఁ గుందుటమాని జాంబవతి, కోపమడంచెను మిత్రవిందయున్"

(పారిజాతాపహరణము)

తక్కిన తరుణీమణులు కోపమాత్సర్యములఁ బొందిరేమో గనుఁడు. సత్యభామ యొక్క పూవుకోసమె మాత్సర్యముఁ బూని కల్పవృక్షమునే తెప్పించుకొని తన పెరటిలో నాఁటించుకొని తన పంతము నెగ్గించుకొనినది. అంతవఱకే యామె కోపమాత్సర్యములు. ఆమె స్వాతంత్ర్యాభిలాషిణి కనుక పట్టినపట్టు వదలక తన పంతము నెఱవేర్చుకొనినది. తరువాత నెంతో శాంతము వినయవిధేయతలు చూపినది. ఇంటింటికిఁ దిరిగి పుష్పఫలాదుల నిచ్చి, తోడి పద్మముఖుల నందఱిని

పేరంటమునకుఁ బిలువలేదా? ఇంతకుఁ బట్టుదలయే ప్రధాన హేతువు.

"కలలోననైన నవ్వులకైన నా మాట
జవదాఁట నెఱచు నో చంద్రవదన!
యే పదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁడో యిగురుఁబోఁడి!
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చు నో చంచలాక్షి!
తోడి చేడియలు నాతోడి వంతులకు రా
నయిరింపఁ జాలఁడో సన్నుతాంగి!

యరమరలు లేని కూరిమి నసఁగి పెనఁగి
కొదలు దీఱని కోర్కులఁ గూడి మాడి
కపట మెఱుఁగని మమతల గలసిమెలసి
యున్న విభుఁ డిట్లు సేయునే యో లతాంగి!"

(పారిజాతాపహరణము)

అని చెలికత్తెతోఁ గృష్ణునకుఁ దనపై నున్న గాఢానురక్తి, ఆయనపైఁ దనకున్న విశ్వాసము వెల్లడించి, యట్టి కృష్ణుఁడు, పారిజాతపుష్పము రుక్మిణి కిచ్చెనని చెలికత్తె చెప్ప సత్య నమ్మలేకపోయినది. అమరలోకమునుండి దివ్యమునీంద్రుఁడు పారిజాతమును దెచ్చి శ్రీకృష్ణున కిచ్చినపుడు చెంతనే పెద్ద

భార్యయైన రుక్మిణీదేవి యున్నను ఎక్కడనో యున్న సత్య భామ మొదట తలఁపునకు వచ్చినది అపుడు

"ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి, దాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీనిన
ల్లిదముం జేసిన జాడదోఁచునొకో, యీ లెమ్మిందు నేనున్నిక్కఁజె
ల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్"

(పారిజాతాపహరణము)

అని కలహాభోజనుని కనుసన్నలతో నిచ్చినాఁడు. అంతమందిలో సాత్రాజితి చిత్తమునకు వచ్చినది కాని మఱెవ్వరును రాలేదు. కలహాభోజనుని కనుసన్న లేకపోయినఁ దీసికొని పోయి సత్యకు నిచ్చునేమో. రుక్మిణి చూచుచుండగా నిచ్చిన పూవును దీసికొనిపోయి సత్యకు నిచ్చుట ధర్మము కాదుగదా? రుక్మిణి బాధ చెందదా! అందుచే నా మాయా కృష్ణుఁడు తన ప్రణయసుందరి పెరటిలోఁ గల్పకుజవిరుహాము నే, అనర్ఘముగాఁ దెచ్చి నాఁటెటకై రుక్మిణికీ దివ్యసుమము నిచ్చియుండ వచ్చును.

సత్యకుఁగల యాత్మాభిమానము మఱెవ్వరికిని లేదు. మహా పౌరుషము రోషముగల మహిమాన్విత, అభిమానమునకై పెనగులాడును.

"ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బళిఁ గూఱ్ఱుదాననా
వంతుకు వచ్చు సత్య గరువంబిఁకఁ జెల్లదఁటంచు మానినీ"

(పారిజాతాపహరణము)

అని చెలికత్తె పరుగుపరుగున వచ్చి సత్యను బురికొల్పినది. 'ఆ పుష్పమును ధరించిన రుక్మిణీదేవిగారు సానఁబట్టిన మకరాంకుని శస్త్రమువోలె సింహాసన మెక్కి త్రిజగంబుల నేలుగతి నొప్పుచున్న'దని సత్యకు ధూపము వేసినది. అంత సత్యభామ తను లెక్కఁజేసి దెబ్బ తిన్న త్రాఁచువోలె, నేయి పోయ జగ్గున మండు భయంకరాగ్ని జ్వాల వోలె లేచి, 'ఆ పువ్వును గొప్పగా వర్ణించి, అతులమహానుభావ మని నారదుఁడు శ్రీకృష్ణున కిచ్చిన నిచ్చుఁగాక; ఆతఁడు తనకుఁ బ్రియమైన వారికి దాని నిచ్చుఁగాక. కాని యీ జగడాల నారదుఁడు నా ప్రసంగమెందులకు నెత్తవలయు'నని గద్గద స్వరముతో వాపోయినది. మఱొకరినైనచో మట్టికరిపించి యుండెడిది. దివ్యమునీంద్రుఁడు కనుక ధైర్యము చూపలేక పోయినది

"సవతు లిందఱిలో నల సత్యభామకన్
నన్నలఁ దిద్దు మురుడ హరి వశంవదుఁడై యున విందు" అను నారదుని వాక్కులనుబట్టి శ్రీకృష్ణుఁడు సత్యభామా విధేయుఁడని తెల్లమగుచున్నది. కృష్ణునిపై సత్య కెట్టి చనవు గలదో నాచనసోమనార్యుని ఉత్తరహరివంశమున నొకచోఁగన్పట్టును.

రుక్మిణీ సత్యభామ లిరుగెలంకులఁ గొలుచుచుండగ గణికానీకము భజింపుచుండ సత్యాముఖంబు చూచి నెత్తమాడుదమనుచుఁ జక్రిధరుఁడు గడంగి

"ఓ తరుణి నేను నెత్తము
నీతో నాడునెడ రుక్మిణి గనుఁగొను బ
న్నాతి మఱియాడ నీవుం
జూ తింతియ పంతమగుచుఁ జోఁ దెల్పుటకున్"

(ఉత్తర హరివంశము)

అని కోరఁగా సత్యభామ

"వాదులాటతోడ వాట్రితోడను
బూతుతోడఁ దిండిపోతుతోడ
నటవిటీనితోడ నడిజురితోడను
వెలకు నెత్తమాడ వెరవు గాదు".

అని యెంత చులకనగా మాటలాడినదో చూడుఁడు? రుక్మిణీ దేవి యొక్క పలుకైనఁ బలుకలేదు. అంత కృష్ణుఁడు సత్యభామ పలికిన సూటిపోటు మాటలకు చిత్తము చిగురించి, మొగము త్రిప్పి, చెలికత్తెతో జాంబవతిని బిలువఁ బనిచి యాజ్ఞాపించును. జాంబవతిని బిలువుమని యాజ్ఞాపించినందులకు సత్యభామ మాత్సర్యముతో రోష ముప్పొంగి,

"చిత్తం బూరక కలఁచెదు
నెత్తము నాతోడ నాడ నేరుపు గలదె

పొత్తు గలసి నీవును నీ
తత్తబ్బళలు రండు గెలిచెదం బరువడితోన్"

అని యెంత పౌరుషముతో నెంత యాత్మాభిమానముతో మాటాడినదో చూడుడు. పాచికలాడుటలో నెంతో నేర్పు లేనిది కృష్ణునిపై వాని పరివారముపై నట్లు 'సవాలు' చేయునా? 'అసలు మీకు పాచికలాడుట చేతనగునా? నేర్పుండిన రండీ! గెలిచెద'నని ధీమాతోఁ బలికినది. నీ తత్తబ్బళలనఁగా జాంబవతి మున్నగు తక్కిన నీ సతీమణులతోఁగూడ వని భావము స్ఫురించును.

సత్యభామలోని సహజవిమర్శనాశక్తి గాంభీర్యము అంతమందిలో నెవ్వరియందును గానము. శ్రీకృష్ణుఁడు సత్యకుఁ బ్రియమఁట. నారదుఁడు కలహభోజనుఁడు కనుక నతనిపై దోషము లేదఁట కృష్ణుఁడు పూవు నీయ దానిని రుక్మిణి స్వీకరించెను. కావున నామెయందును దప్పులేదఁట. మఱెవ్వరిది తప్పు? తన ప్రాణమైన ధూర్తగోపాలునిదే దోషమఁట. మఱొకరెవ్వరైన నిట్లు కృష్ణుని నిందించి మనఁ గలరా? అది సత్యకే తగినది.

పరికింపరు తమ జాడలు
తరుణుల తగుబములు నమ్మఁదగదంద్రు మదిన్
శరదంబుద చలచిత్తులు
పురుషులెపో వారి నమ్మఁబోలునె చెలియా?

(పారిజాతాపహరణము)

ఈ పద్యములోని భావము పరికించి చూడ నేటినాగరికస్త్రీ స్వభావ మిందుఁ గన్పట్టును. 'మగవారు తమ ప్రవర్తనముల మంచిచెడ్డలను బరికింపరు. కాని యువతుల యనురాగాసక్తుల నమ్మఁగూడదని వారిని నిందించెదరు. నిజ మాలోచింపఁ బురుషులే మిగుల చపలచిత్తులు. కావున వారి నే విషయము నను నమ్మరాదు, నమ్మరా'దని యే విధముగాఁ బురుషుల విమర్శించినదో కనుఁడు. నేటి యువతీ యువకులు కూడ పరస్పరము విమర్శించుకొనుట యొక యాచారము కాలేదా? కృష్ణునిపై సత్య కెంతో అధికారము లేనిది యీ విధముగా విమర్శింపఁజాలదు.

పారిజాతకుసుమమును దెచ్చి తన కీయలేదని సత్యభామ యలుకఁ బూని కోపగృహమునఁ జీఁకటింటిలో మూతి బిగించుకొని ముడుచుకొని పరున్నది. గోవిందుఁడు రుక్మిణికిఁ బూవు నిచ్చినాఁడే కాని, సత్యను దలఁచుకొన్న గుండెలలోఁ బిడుగు పడినట్లగుచున్నది. సత్యకడకు రాకుండ నుండ లేకపోయినాఁడు. ఆమె భవనమునకు బయలుదేరినాఁడు. భవనములో నెక్కడను సద్దు లేదు. తేలుకుట్టిన దొంగవోలె సద్దుచేయక సత్యకడకు వచ్చినాఁడు. చెలికత్తె సురటి పట్టుకొని వీఁచుచున్నది. అప్పుడే పారిజాతము నంటివచ్చినాఁడు కదా! ఆ పరిమళము భవన మంతయు వ్యాపించినది. ఆ దివ్య సుగంధము మఱింకొంచెము కోపకారణ మైనది. సత్యకు, కన్నీళ్ళు కాలువలై కాఱిపోవుచున్నవి. వేడి నిట్టూర్పు లెక్కు వయినవి. ప్రియురాలి కోపము మాన్పుటకు నెన్నో మాయ

మాటలాడినాఁడు. ప్రాధేయపడినాఁడు. కాని లాభములేక పోయినది. తుదకుఁ 'దప్పు క్షమింపు' మని యా సత్యకాళ్ళ మీఁదఁ బడినాఁడు. అప్పుడు

"జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరసుచ్చో వామపాదంబునం
దొలగం దోచె లతాంగి, యట్లయగు నాథుల్నేరముల్సేయఁజే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్నేర్తురే"॥

(పారిజాతాపహరణము)

ఆహా! సత్య కెంత గర్వము. మానవమాత్రుల దృష్టిలో సత్యభామ గర్వియే. కాని యా రసికుని దృష్టిలో సత్యభామ ప్రణయసుందరి. ఆ రసికుని కామె కాలి తన్ను పూలచెండుదెబ్బవంటిది. ఆదెబ్బతో నా కుహనా గోపాలుని మెయి గగుర్పొడిచినది ఉద్దీపితమన్మథ రాజ్యాభిషిక్తుఁడై నాఁడు. 'తన జన్మము పావనమైన' దనుకొనినాఁడు

అంతటితో నాఁగలేదు. 'చిగురు వంటి నీ పాదము, ముల్లుల వంటి నా పులకాగ్రములఁ దాఁకి యెంత బాధఁ జెందితివో' యని సత్య వామపాదతాడనమునకుఁ గాదు కాని యా మె పాదపల్లవమున కేమైన నొప్పి కలిగినదేమో' యని కృష్ణుఁడు బాధఁ జెందినాఁడు. ఈ మాటలకు సత్య లొంగునా? అనవలసినమాట లన్నియు ననినది. జంకుగొంకు లేక వెక్కస మంతయు వెళ్ళఁబోసినది. కృష్ణుఁడు కుక్కిన పేనువోలె

కిక్కురుమనలేదు. సత్యభామ యింతగా దూషించుచున్నను, కొంచెమైన కృష్ణునకా దూషణము లన్నియు భూషణము లవలెఁ శ్రవణానందము గొల్పినవి. ఆమెను నిండు గౌఁగిటఁజేర్చి బుజ్జగించి నునుఁ జెక్కుల జాఱు కన్నీరు కరంబునం దుడిచి, పారిజాతమును,

> "వామలోచన! నీ కేళివనములోనఁ
> జలువ వెదఁజల్లు చెంగల్వకొలని కెలన
> సరసకర్పూరకదళికాతరుల నడుమఁ
> బెరటిచెట్టుగ నాఁటింతుఁ బెంపు గనుము"

అని యనునయించునంతవఱకు సత్య తన గరువమును గోపమును మానలేదు. సత్యభామ సరసాలాపములతో సాదరముగా బుజ్జగింపఁబడిన తరువాతఁ దనదగ్గరకు వచ్చిన నారదునకు సగౌరవముగా నాతిథ్య మిచ్చి సత్కరించి, 'ధన్యవు' అని వానిచే దీవెనలను గూడఁ బొందినది అంతకు ముందే కదా! ఆ దివ్యమునీంద్రునిపైఁ గోపానలమును గురియించినది. సత్యకోపము తృణాగ్నివంటిది కాఁబోలు. ఆమె పట్టి అమాయకురాలు. 'నీయంతటివారు లే' రనిన నంతలో డెందము కొండంతయై యార్ద్రితఁ జెందును. అట్టి యజ్ఞానురాలు కాదుసుమా! గోడచాటున గుసగుసలు నసనసలు నారీమణులకు నైజమైనను సాత్రాజితికి మాత్రము అట్టివి వెగటు కొల్పును. అనవలసిన నాలుగుమాటలు ప్రత్యక్షముగా ననును గాని యందు దాఁపరికముంపదు.

చెవులకు వెక్కసముగు వచ్చి శృంగారమును వర్ణించు దక్షిణాంధ్రయుగమున వెలసిన 'సత్యాభామా సాంత్వనము'లో సత్యాకృష్ణులు 'లౌకికమానవమాత్రులుగా' శృగార దేవతలుగాఁ జిత్రింపఁబడిరి. అదే యుగమున వెలసిన చేమకూర వేంకటకవి తన 'విజయ విలాసములో' సత్యభామనుబూర్తిగాఁ జిలిపి పిల్లగా కృష్ణుని గొంటెకృష్ణుఁడుగాఁ జిత్రించినాడు.

యతివేషములో నున్న యర్జునుఁడు తనకు శుశ్రూష చేయుచున్న సుభద్రకు 'తా నర్జునుఁడ నని' గాంధర్వవివాహమాడు'మని తన యనురాగమును దెల్పి యడ్డగించును. సుభద్ర కన్యకదా! భయపడి మాయ మాటలు చెప్పి తప్పించుకొనివచ్చి యింటికడ నొంటరిగాఁ బండుకొని విజయుని దలఁచుకొని విరహతాపము చెందును ఈ విషయము సత్యకు ముందుగాఁ దెలియును. ఆమె విరహచిహ్నములు గని వదినలెట్లు గేలి చేసిరో తిలకింపుఁడు.

'ఏమి తలఁచుకొనినావో పాపము నీ శరీర మంతయుఁ బులకరించిపోయిన' దని మిత్రవింద మేళము లాడినది 'ఇది వఱకువలె మనసిచ్చి మాటాడుట లేదు. నీ దృష్టి యెక్కడనో యున్నది. పోనిమ్ములే' యని కాళింది పరిహాసము చేసినది 'ఈమధ్య చెలికత్తెలు పెండ్లికథలు చెప్పఁ జెవియొగ్గి వినుచున్నావు. నీ మనస్సులో నేదో యున్నదిలే' యని భద్ర గేలిచేసినది 'నీమొగములో వలపువాసన లీనుచున్న' వని సుదంత వేళాకోళము చేసినది. సుభద్ర విరహమును జూచి జాంబవతి నవ్వినది. లక్షణ సరసమాడినది. 'ఎందుల

కా ముద్దరాలి నా విధముగా గేలిచేసి బాధపెట్టెద' రనిరుక్మిణి వారిని వారించినది. రుక్మిణి ఎంత పెద్దమానిసి యోచూడుడు.

ఇంతమంది యిన్ని విధములుగాఁ బరిహాసమాడ చిట్టి మఱఁదలు మోహంపుఁ జిన్నెలెఱిఁగి సత్యభామ కన్నుగీటి నదఁట. ఆహా! సత్యభామ యెంత చిలిపిది. ఎవరికిఁ దోఁచి నట్లు వారు మచ్చికమాటలాడ విని యా యెలజవ్వని సుభద్ర సిగ్గుతో నూరక యుండఁగా

"కాఁగి యున్నది మిగుల నంగంబుచూడఁ
గలవరించుచునున్నది, కలయొయేమొ
పోఁకు డల్ల సన్న్యాసికె చూప వలయు
భామనని పల్కె నా సత్యభామ నగుచు"

(విజయవిలాసము)

ఈ విధముగా ముద్దుల మఱఁదలిని వేళాకోళము చేసి యేడిపించి నది. ఆమె కలుపుగోలుతనము చిలిపితనము రసికహృద యము వాక్చాతుర్యము నెఱుంగుటకు నీ వాక్య మొక్కటి చాలదా? పదివేల మాటలేల? అంతటితో నాఁగలేదు.

"ఈ లీల నుండ మనమిటు
మేలము లాడంగనేమి మిడిమేలమొ యం
చాలో సత్య సుభద్ర హి
తాళుల కిసుమంత యా రహస్యముఁ దెల్పెన్"

(విజయవిలాసము)

పైకిఁ బెద్దమాసిసివోలె ఎంత మృదు మధురమైన వ్యంగ్య భాషణము లాడినది. కాఁగుటయన మన్మథతాపము. కలవరించుటయన రేయుంబవ లర్జునుని దలఁచుకొనుట. ఈ విధముగా నుండుట గాలియుఁట. ఈ గాలి (సోకుడు) ని పాఱఁద్రోలుట కల్ల సన్న్యాసియే (అర్జునుఁడు) సమర్థుఁడఁట. అందుచే నతనికే చూపవలయు నఁట ఈ సోకుడుతో సుభద్ర బాధ చెందుచు నుండ మేలము లాడుట సమంజసము కాదని తక్కినవారిని నివారించుచుఁ దా నొక ప్రక్క రహస్యమును సుభద్ర హితాళుల చెవులలో నూఁదినది. సరసత్వమన్న సత్యకెంత మక్కువయో స్పష్టమగుచున్నది.

సత్యభామ యింటికే తెంచి నారదమహర్షి యాడిన మాటలఁబట్టి సత్య యెంత దిట్టయో విశదమగును.

"అనికైనం బతినిన్నుఁబాసి చనినో ప్రాణంబు ప్రాణంబుగా
నినుమన్నింపఁడో నీమనోరథములన్నయ్యంబుతోఁ జేయఁడో
చనవుల్నీవలె నెవ్వరేఁగనిరో నీ సౌభాగ్య మింతంతయే
నినుఁబోలంగల రబ్జగంధు లన వింతే యెందు సాత్రాజితీ"

(పారిజాతాపహరణము)

ఈ మునివాక్కులంబట్టి కృష్ణుఁడు సత్యభామావిధేయుఁడనియు నట్టి జగదేకమోహనాకారుని లోపఱచుకొనిన సత్యభామ యొక్క యసదృశమైన సౌందర్యము రసికహృదయము నూహించుట కవులకే చెల్లినదికాని సామాన్యుల కతీతమనియు విదితమగుచున్నది.

# "భారతీయ నాట్యకళ - వికాసము"

లలిత కళలలో నాట్యకళ ప్రథమగణ్యము. ప్రకృతి సౌందర్యమును జూచి పరవశ్యు డొక్కు ప్రాక్తనమానవుని హృదయమున నావిర్భవించిన భావచైతన్యమును వ్యక్తీకరించుటకు, తాళలయాన్వితముగాఁ దాను సల్పిన శరీరావయవ విక్షేపమే నృత్తమైనది. అంతమాత్రమున సంతుష్టిఁ జెందనివాని హృదయము, నోటితో నాలాపించుచు, భావానుగుణముగ నభినయము చేయ మొదలిడెను. అట్లు కదను ద్రొక్కుచు, పదము పాడుచు, నభినయించు వాని కృషియే నాట్యమైనది.

భావప్రదర్శనముచే రసోత్తేజమును గలిగించుట నాట్యకళకుఁ బ్రధాన లక్షణము. ఆసక్తి గల ప్రేక్షకుని హృదయమును రంజింపఁజేయని కళ-కళ కాదు. అది కళకు కళంకమే యగును ప్రదర్శకుఁడు పూర్తిగాఁ గళలో నిమగ్నుఁడై కళా సత్యమును బ్రేక్షకునకుఁ జూపినపుడే యాతఁడు ధన్యుఁ డగును. కళకు జీవము కల్గును ప్రేక్షకుఁ డానందము పొందును.

నాట్య-నాటక కళలలో భావము వ్యక్తము కానిచో రస ముద్భూతము కాదు. రసోత్పత్తి లేనిచో ప్రేక్షకు లానందింపలేరు. కావున నటు లౌచిత్యానౌచిత్యముల నెఱిఁగి

ఆహార్యకము (3) వాచకము
సాత్త్వికాభినయనము



చతుర్విధాభినయముల సాహచర్యముచే సరసత్వమును గలిగించుటకుఁ బూనుకొందురు.

భారతీయకళలు వాస్తవికత్వము కంటె నాదర్శత్వమున కెక్కువ ప్రాధాన్య మిచ్చును. వాస్తవికత్వ మనఁగా లోకధర్మము. ఆదర్శత్వ మనఁగా ధర్మోపదేశము. విషాద వియోగములకు నిలయమైన లోకధర్మమును దిరిగి కళలో ననుభవించుటలో జీవితమున కుత్తేజ మేమున్నది? అందుచే నాదర్శవంతమైన ధర్మోపదేశమును బొంది లౌకికకష్టములను మఱచి యానందించి జీవితమును సుఖవంతముగా మార్చుకొనుటకు నిర్దేశింపబడినవి భారతీయకళలు. ఆ ధర్మోపదేశము ప్రత్యక్షశబ్దార్థములతోఁ గాక భావాత్మకధ్వనిప్రధానమై యుండును. క్షేత్రయ్య పదములు జయదేవుని గీతములు ధ్వనిప్రధానమైనవి. అవయవ విక్షేపముచే గోపికలు గోపాలుని పైఁ జూపిన భక్తి, శృంగారభావములు ప్రేక్షకుల మనసున హత్తుకొనునట్లు నటించుట నర్తకుల కర్తవ్యము. శ్రీకృష్ణపరమాత్మను దెలిసికొనుట యిందలి ధ్వని.

భారతీయ నాట్యకళ ప్రాచీనకాలమునుండియు ఆధ్యాత్మిక-మత తత్త్వసంబంధముల నంటిపెట్టుకొని వర్ధిల్లినది. అట్టి నాట్యకళ నాధారము చేసికొని మన మతములు కూడ విలసిల్లినవి బ్రహ్మసాక్షాత్కారముచే బ్రహ్మానందమును గలిగించి మోక్షసాధనమునకు మూలమైనది భారతీయ నాట్యకళ. మోక్షసాధనమునకు మూలమయినందుననే భార





తీయు లీ కళను గొప్పగాఁ బోషించిరి. దేహాత్మల కేకత్వ మును సిద్ధేశించి సత్సాయుజ్యమును సంపాదించుటకుఁ దోడ్ప డునది నాట్యకళ. అట్టి నాట్యకళ నీ జగమునకు మొట్ట మొదటఁ బ్రదర్శించి చూపినది పరమయోగి జగన్నాటక సూత్రధారియగు పరమేశ్వరుఁ డని కొందఱిభావము. భార తీయతత్వశాస్త్రము మతసిద్ధాంతములు దెలియని మానవాళికి భారతీయ నాట్యకళ యవగాహమగుట దుర్లభము అనంత మైన భావసంపద-అపారమైన శిల్పచాతుర్యము-నిగూఢమగు ధర్మోపదేశ మిందు నిండి యుండును. తననుండి విడిపోయి వివిధరూపములు దాల్చిన భిన్నవిభిన్నమైన జీవాత్మలను దిరిగి తనయాత్మలో నైక్యపఱచుటకు శ్రీకృష్ణపరమాత్మ బృందావన నృత్యము చేసెను. ఆ పరమాత్మను సందర్శించుటకు శ్రీకృష్ణుని చుట్టును జేరి గోపికలు రాసక్రీడయొనర్చిరి. అట్టి గోపీగోపాలురనృత్యమే నాట్యకళకుఁ బ్రారంభమనియు దానిని భరతమహర్షి భూలోకమునకుఁ దెచ్చెననియు నాధ్యాత్మిక తత్వవాదుల మతము. ఈ పరమసత్యము కొ్రొత్తవారికి దురవగాహనమే గదా!

దేవతల యాదరాభిమానములు చూఱఁగొనుటకై నాట్యశాస్త్రమును వ్రాసి భరతమహర్షి యొకానొక తరుణ మునఁ బార్వతీపరమేశ్వరుల యెదుటఁ బ్రదర్శించెను. సర్వజ్ఞుఁ డగు పరమేశ్వరుఁడు భరతుని కళానైపుణ్యమునకు ముద మంది ప్రమథగణములో ముఖ్యనర్తకుఁడయిన 'తండు'ని బిలిచి తన జగన్నృత్యమును మహర్షికి నుపదేశింపు' మని

యాజ్ఞాపించెను, ఆతీరుగ 'తండు'నిచే నుపదేశింపఁబడినది కావున 'తాండవనృత్య' మనిరి. అదే సమయమున జగన్మాత యగు పార్వతీదేవి, తనకుఁ దెలిసిన నృత్యమును అనిరుద్ధుని భార్యయగు ఉషాదేవికిఁ దెల్పెను. ఆ నృత్యమునే 'లాస్య' మనిరి ఉషాదేవి ద్వారకానగర స్త్రీలకు నేర్పెను. అట్లు క్రమముగా 'లాస్య' నృత్యము దేశమంతయు వ్యాపించె నని పురాణగాథలు వాకొనుచున్నవి.

పురాణములకంటె నతిప్రాచీనములైన ఋగ్వేదాదులలో నాట్యకళ ప్రస్తావింపఁబడినది జైమినీయబ్రాహ్మణములో (11, 42-44) నృత్య-సంగీత-వాద్యములను, సుగంధములను, అప్సరసలను గుఱించి యొక చక్కని వర్ణన కలదు. దీనినిబట్టి వేదయుగములో స్త్రీలు వినోదమునకై నాట్యమును నేర్చుకొనెడివారని స్పష్టమగుచున్నది. కాని మహాభారత కాలమునాఁటికి నాట్యకళ కొక ప్రత్యేకత వచ్చినది విరాటుని కొలువులో అర్జునుఁడు బృహన్నల వేషమున నచ్చటి యంతఃపుర స్త్రీలకు సంగీతనాట్యములు నేర్పుటను బట్టి యాకాలమున నాట్యకళ కొందఱికి వృత్తిగా నున్నట్లు తోఁచుచున్నది.

'మొహంజదారో' పట్టణము త్రవ్వకములలో బయల్వెడలిన యొక కంచు విగ్రహమును బట్టి క్రీ. పూ. రెండు మూఁడు శతాబ్దములనాఁటికే భారతదేశములో నాట్యకళ మహోన్నత స్థితిలో నున్నట్లు తెలియుచున్నది అది దగం

బరమైన యొక నర్తకి స్వరూపమును దెల్పు విగ్రహము. ఆ విగ్రహమును బరిశీలించిన పెద్దలు ఈ కాలమున నాట్యకళ మతసాహచర్యముతో వర్ధిల్లినదని వ్యక్తపఱిచిరి. జాతక కథలలో సంగీత నాట్యముల గుఱించి చాల నిదర్శనములు గలవు రాజులు పూర్తిగ మద్యమును సేవించి నాట్యకర్త్రులతో సరససల్లాపము లాడుచు వినోదముగా వనవిహారములు సల్పుచున్నట్లనేకకథలలో వర్ణింపబడినది. క్రీస్తునకుం బూర్వము వాఁడగు పాణిని తన వ్యాకరణ శాస్త్రములో 'నృత్' ధాతువును గూర్చి వివరించుచు, శిలాలిన్ (silain) 'కృశాశ్విన్' అనువారల సూత్రములను బేర్కొనెను. ఇందుచే నాట్యకళ, దేశములో నప్పటికిఁ గొన్ని శతాబ్దములకుఁ బూర్వమే గొప్ప ప్రసిద్ధిలో నుండి యుండవలెను. లేనిచో నాట్యగ్రంథములు వెలువడవు. లక్ష్యమును బట్టియేగదా! లక్షణ ముత్పన్నమగును.

కౌటిల్యుని కాలమున రాజులే స్వయముగా నాట్యకర్త్రులకు జీవనోపాధిని కల్పించి పోషించుచున్నట్లు తెలియును. నర్తకి-అభిసారికలకు భేద మున్నట్లు కౌటిల్యుఁడు వివరింపలేదు. అనగా వేశ్యలే సంగీత-సాహిత్య-నృత్య వాద్యముల నభ్యసించి, పాలకపాలితులను సంతోషపఱచెడి వారు. మౌర్యులు నాట్యకళ నొక పవిత్రధర్మముగా భావించి పోషించిరి

క్రీ. శ. మొదటి శతాబ్దములో భరతుఁడు నాట్యశాస్త్రమును సంస్కృతమున రచించినట్లు చరిత్రకారు

లూహించుచున్నారు అందు సంగీతసాహిత్యనాట్య నాటక ములు రససిద్ధాంతము రంగస్థలము-వీనినిగూర్చి సవివర ముగాఁ జెప్పఁబడినది అప్పటికి భారతదేశ మంతట నాట్య కళ గొప్ప ప్రసిద్ధిలో నుండి ప్రజలచేఁ బ్రస్తుతింపఁబడియుండెను. లేనిచో నదే శతాబ్దములో దక్షిణభారతమున తమిళభాషలో 'శిలప్పదికారము' వెలువడియుండదు 'శిలప్పదికారము'లో నాట్యశాస్త్రములో వలె సంగీత నాట్య నాటక లక్షణము లన్నియు నుదాహరింపఁబడియున్నవి. ఈ కాలమున రాజులు నర్తకురాండ్ర నెంత గౌరవమర్యాదలతోఁ బోషించిరో వారి కెట్టి పారితోషికముల నిచ్చిరో నాట్యకళ కెంత ప్రాధాన్య మున్నదో 'శిలప్పదికారము'లో నొక గాథ తెల్పును.

'మాధవి' యను బాలిక సప్తవర్షములు ఘోరతపస్సు వలె దీక్షతో నృత్యమును నేర్చి గొప్ప ప్రావీణ్యమును సంపాదించి పాలకుని యెదుటఁ బ్రదర్శించెను. ఆ నృత్యములో బంగారుతీగె వలె మెఱయు నామెను ఆమె నృత్యనైపుణ్య మును గాంచి రాజు వేనోళ్ళఁ బొగడి 1008 బంగారు నాణె ములను గూర్చిన పచ్చని పూలదండ నామెకుఁ బారితోషి కముగా నొసంగెను. మాధవి యా దండను తన దాసికి నిచ్చి 'దీని నెవరు కొనెదరో వారు తనకు భర్తయగు'నని చెప్పి దాసి నొక రాజవీధిలో నుంచెను. ఆ మాలను 'కోవలన్' అను నొక సంపన్నగృహస్థుఁడు 1008 బంగారు నాణెముల నిచ్చి కొనె. మాధవి యొక్క ప్రణయానురాగాద రములకుఁ బాత్రుఁడై నాట్యకళకు దాసుఁడై భార్యాబంధు

వులను గూడ మఱచి యామెతోఁ దనివి చెందెను.

దీనిబట్టి యా కాలమున నాట్యకళ కెంత ప్రోత్సాహ ముండెడిదో వ్యక్తమగుచున్నది.

వాత్స్యాయనుఁడు తన కామసూత్రములో చతుష్షష్టి కళలను బేర్కొనెను. సామాన్యముగా నీ కాలములో రాకుమారికలు సర్వకళలను సాధనము చేసెడివారు. సహస్ర సతీ సమేతుఁడయినను రాజు, సర్వకళాసంపాదకియగు నొక్క భార్యకు 'దాసోఽహమ్మనవలసినదే' యని వాత్స్యాయనుఁడు వచియించెను. అందుచే నీ కాలమున కళాకారుల కెట్టి విలువ యున్నదో వ్యక్తమగుచున్నది.

కవికులగురువగు కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రములో నాట్యకళకు నాట్యాచార్యులకు గొప్పకీర్తిని దెచ్చెను. మాళవిక తన నృత్య నైపుణ్యముచే రాజును వశపఱచుకొనుటను బట్టి క్రీస్తుకుఁ బూర్వమే అతిమేధావంతులయిన నాట్యాచార్యులు నర్తకు లున్నట్లు స్పష్టమగుచున్నది. మాళవిక రాజు నెదుటకు వచ్చి ముందుగా భావగీతముల నాలాపించి తరువాత నా గీతార్థమును దన నృత్యములోఁ దెల్పును. క్రమముగా నీ నాట్యకళను దేవదాసు లుపాసించిరి దేవతోత్సవసమయములఁ బ్రదర్శించి ప్రజల మన్ననలను బడయుచుండిరి. విజయనగరరాజులు శృంగారలోలురై దేవదాసులకుఁ బ్రత్యేకముగా మడులు మాన్యముల నిచ్చి పోషించినట్లు చరిత్ర రుజువుచేయుచున్నది. దేవదాసులను బోషించునిమిత్తమై యా కాలములో

వివాహము చేసికొనిన వారిపై సుంకములను విధించినట్లు శాసనాధారములు గలవు. విజయనగరరాజులు సంగీత నృత్యములపై అత్యాసక్తి అభిరుచులు కలిగియున్నట్లు పోర్చుగీసు చరిత్రకారుఁడగు పయిస్ (Paes) వ్రాఁతలను బట్టి తెలియుచున్నది.

నాట్యనాటకములకుఁ బ్రాచీనకాలమునుండియు సన్నిహితసంబంధము గలదు. పూర్వనాటకములఁ బరిశీలించినచో సంభాషణయేగాక అందుఁ గల సంగీత నృత్యములమీఁదను రూపకప్రయోజన మాధారపడియున్నట్లు స్పష్టమగును.

తాళ లయాన్వితమైన చతుర్విధాభినయములు నృత్య నాటకములకు నవసరములే. ప్రేక్షకుల హృదయమున రసభావముల రేకెత్తించుట రెండింటియొక్క ముఖ్య ధర్మములు. ప్రేక్షకు లానందానుభూతితో తన్మయులగుట వాని యంత్యప్రయోజనము.

మన కుపలబ్ధములైన నాట్యగ్రంథములలో భరతుని నాట్యశాస్త్రము మొదటిది. నందికేశ్వరుని అభినయ దర్పణము రెండవది. నాట్యకళను గుఱించి రెండును అధికారికములే. ఈ రెండింటిలోను బ్రేక్షకున కుండవలసిన ధర్మములు నిర్దేశింపఁబడినవి, పామరుఁడు కళాసౌందర్యమును గాంచఁ గలఁడే కాని కళాసత్యమును గుర్తింపలేఁడు. అందుచేఁ బ్రేక్షకునకుఁగూడఁగొంత కళామయజ్ఞాన మవసరమని యభివ్యక్తపఱచిరి.

భారతదేశమున నాదికాలము నుండియు పట్టాభిషేకములు సాంఘికోత్సవములు దైవోత్సవములు జన్మదినోత్సవములు గృహప్రవేశోత్సవములు మున్నగు శుభసమయములందు నాట్య నాటక ప్రదర్శనములు జరుపుకొనుట యొక యాచారము, ఆ ప్రదర్శనములకు దేవదాసులు ప్రత్యేకముగా రాజులచేఁ బోషింపఁబడుచుండెడివారు, ఇట్టి యాచారము అమరపురిలో అప్సరసలు జరుపుచున్నట్లు పురాణము లుద్ఘోషించుచున్నవి.

రంగస్థలమున నుండవలసిన కొలతలను గూడ నాట్యశాస్త్రము వివరించినది. రాజాంతఃపురములలోనే గాక సామాన్య ప్రజానీకమునకై బహిరంగ నాట్యనాటకశాలలు కూడ క్రీస్తునకుబూర్వము ఉండెడివని స్పష్టమగుచున్నది. ప్రాచీనకాలమున నిర్మింపఁబడిన యొకనాట్యశాల 'రాంఘర్' కొండలలో 'సితాబెంగ' గుహాయందు బయల్వెడలినట్లు కొందఱు చెప్పుచున్నారు. ఇందొక రాతిని ధనురాకారముగాఁ దొలిచి అందొక వేదికయు ప్రక్కగ వాద్యగాండ్రకు ప్రత్యేక నిర్మాణస్థలము, ప్రేక్షకుల కాసనములు చక్కఁగా నిర్మింపఁబడినవి. దీనికి సమీపమున 'జోగిమర' గుహ యొకటి కలదు ఇది కేవలము నాట్యమును బ్రదర్శించు స్త్రీలకు విశ్రాంతిభవనముగా నుద్దేశింపఁబడి నిర్మింపఁబడినది. దేవదత్తుఁడను నతఁడు 'సుతనుక' అను నర్తకిని బ్రేమించి యామె జ్ఞాపకార్థ మీ గుహను నిర్మించి నట్లచట నొక శాసనము దెల్పుచున్నది.

భారతదేశములోఁ బ్రస్తుతము భరతనాట్యము- కథాకలి - కథక్ - మణిపుర నృత్యములు గొప్ప ప్రసిద్ధిలోనున్నవి. ఇవిగాక గుజరాతులో గార్భనృత్యము - సంతాలుల సంతాల నృత్యము- తెలుఁగునాడున కూచిపూడిభాగవతము మిక్కిలి ప్రసిద్ధిలోనికి వచ్చుచున్నవి.

ఇవి యా యా ప్రాంతీయవాతావరణములో విలసిల్లిన జానపదనృత్యము లయినను పూర్వమునుండియు నాట్యశాస్త్రము ననుసరించి జీవమును బొందించవే యగుచున్నవి. భరతనాట్యమును బాగుగ నాదరించి యనుసరించినవారు తమిళదేశస్థులు. తమిళదేశములో భరతనాట్యమునకు శాశ్వతత్వముఁ జేకూర్చినది నట్టువనార్లు (ఆచార్యులు) వీరు నాట్య కళాపోషకులు. నాట్యశాస్త్రమును గూలంకషముగా నప్పఁజెప్పఁగల సమర్థులు. ఒక శతాబ్దము క్రిందట తంజావూరు సోదరులగు పొన్నయ్య, వడివేలు పిల్లాయ్ అనువారలు నాట్యకళ నుద్ధరించినవారిలో సుప్రసిద్ధులు. వీరు గొప్ప సంస్కృతపండితులు. నాట్యకళారాధకులే గాక వీరు కళాసంస్కర్తలును. వీరి శిష్యప్రశిష్యు లెందఱో నేఁటికి నీ కళ నారాధించుచున్నారు. ఆంధ్రదేశములో నటరాజ రామకృష్ణునివలె తమిళనాడులో మీనాక్షి సుందరంపిల్లాయ్ కేరళలో ఉదయశంకర్ ప్రస్తుత నాట్యకళా ప్రదర్శకులలో సుప్రసిద్ధులు.

మొదట భరతనాట్యము స్త్రీలకుద్దేశింపఁబడినది. కాని నేఁడు స్త్రీ పురుషు లందఱు దీని నారాధించి యానందించు

చున్నారు. మొదట పురుషులకు దారిచూపినది 'రాంగోపాల్' అను కళోపాసకుఁడు. అతఁడు భరతనాట్యము నవగాహము చేసికొని యా కళాసౌందర్యమును క్రియారూపమున నానందించెను. నేఁటి నాగరికయువకులు సంగీత నాట్యముల నెఱింగిన నెఱజాణలనే వివాహమాడుటయు, అట్లే సంగీతనాట్యముల నెఱింగిన నందగాండ్రను స్త్రీలు వలచుటయు నొక యాచారమైనది.

కథాకలి నృత్యము నేఁటి కేరళరాష్ట్రములో నాచార ధర్మముల ప్రాతిపదికముపై నుప్పతిల్లినది. దీనికి మొదట రంగస్థల ప్రాధాన్యమును గల్పించినది 'కొట్టరక్కర' రాజు కాలికట్టు ప్రాంతములో 'కృష్ణానట్టమ్' అను ప్రాంతీయ జానపద నృత్య మమలులో నున్నది. దీనికిఁ బోటిగా 'రామనట్టమ్' అను మఱొక విధమైన నృత్యము వెలసినది. ఇది నేఁడు కథాకలి నృత్యములో లీనమైనదని చెప్పెదరు. కథాకలి నృత్యము కేవలము మూకాభినయముతోఁ గూడినది. ఇందు సంగీతమునకుఁ బ్రాధాన్యము లేదు. కాని శబ్దార్థ సూచకముగఁ జేయు నభినయమునకుఁ బ్రాధాన్యము గలదు. కథాకలినృత్యము వీరభయానకరసప్రధానమైనది. ఇందు స్త్రీ లభినయము చేయుట దుర్లభము. స్త్రీ పాత్రలను బురుషులే అభినయించెదరు. కాని నేఁడు స్త్రీ పురుషు లందఱును గథాకలినృత్యమును చేయుచున్నారు.

భరతనాట్యము నృత్యప్రధానము కాఁగ, కథాకలి, నృత్యనాటక ప్రధానమైనది. భరతనాట్యమున 'లాస్య'

నృత్యము కథాకలిలో తాండవనృత్యమును ప్రసిద్ధములు,

'లాస్య' నృత్యము స్త్రీలకు, తాండవనృత్యము పురుషులకు నుద్దేశింపఁబడినవి. కాని నేఁడు లాస్య నృత్యమును బురుషులు చేసినట్లు, తాండవనృత్యమును స్త్రీలు చేయుచున్నారు. కథాకలినృత్యమును మలబారు మహాకవి ప్రసిద్ధ నటుఁడగు వల్లతోల్ చక్కఁగా నుద్ధరించెను. ఇతఁడు 'కేరళ కళామండల' మను నొక సంస్థను స్థాపించి కథాకలి నృత్యము నర్వాచీనపద్ధతిలో సంస్కరించి ప్రాచ్యపాశ్చాత్య దేశస్థులను గూడ మురిపించెను.

'లాస్య తాండవ' నృత్యముల సమ్మేళనమే కథక్ నృత్యము. ఇందు పాదవిన్యాసమునకుఁ బ్రాధాన్యమెక్కువ. తాళలయబద్ధముగా నృత్యముచేయుచు రసోత్పత్తిని గలిగించుట యిందలి ప్రధాన లక్షణము. కథక్ నృత్యమును బ్రసిద్ధికిఁ దెచ్చిన వారిలో 'కల్క' 'బింద' అను వారలు ముఖ్యులు. వీరి తరువాత కథక్ నృత్యము నున్నతస్థితికిఁ దెచ్చిన ముఖ్యులలో అచ్చాన్‌మహారాజు, సాంబుమహారాజు పేర్కొనఁ దగినవారలు.

బెంగాలురాష్ట్రములో మణిపురినృత్యము మహాకవుల మన్ననలనుగూడఁ బొందినది దీనిని రవీంద్రనాథఠాగూరు సంస్కరించి అధునాతనపద్ధతిలో నడపించెను. మణిపురి నృత్యము ముఖ్యముగా రాధాకృష్ణుల లీలలు నభివర్ణించును. బెంగాలులో మధ్యయుగమున ప్రజ్వరిల్లిన చైతన్యుని మత ప్రభావమే యిందులకు ముఖ్యకారణము. కృష్ణుని రాసక్రీడ

మణిపురి నృత్యములోఁ బ్రధానపాత్ర వహించినదని చెప్ప వచ్చును. రాసనృత్యములో వైష్ణవ భావగీతములను గాని, జయదేవుని భక్తిగీతములను గాని పాడుదురు. వాద్యనృత్య సమ్మేళనమే గాక ఇందు ముఖ్యముగా 'పల్లవి' ప్రధానమై యుండును. మణిపురములో బయలుదేరిన మఱొక విధమైన ప్రసిద్ధ నృత్యము 'లాయహారోబ'. ఇది రాసనృత్యము కంటెఁ బురాతనమైనది. నిగూఢమైన భావార్థములతో నిండి నిబిడీకృతమై ప్రజల నుత్తేజపఱచు నృత్యములలో నిది యొకటి.

అట్టి భారతీయ నాట్యకళ దేశములోనే గాక, బర్మా-కంబోడియా-జావా మున్నగు విదేశములయందు నతి ప్రాచీన కాలముననే స్థావర మేర్పఱచుకొని, యా ప్రాంతీయ వాతావరణములతోఁ బెరిగి వర్ధిల్లినది. దేశ కాల సాంఘిక వాతావరణములఁబట్టి కొద్దిగా మార్పు గోచరించినను, పూర్తిగా భరతుని నాట్యశాస్త్ర విధానమే వీని నాట్యకళకు మూలము. ఆంగ్లేయులు పాలించిన మూఁడువందల యేండ్లలోను భారతీయ కళల కెట్టి ప్రోత్సాహము కలుగలేదు. సరికదా, ఉన్న ప్రాణములు పోయి జీవచ్ఛవములవలె కృశించిపోయినవి. నేఁడు కాంగ్రెసు ప్రభుత్వమువారు లలితకళలను బ్రోత్సహింపనెంచి ప్రతిసంవత్సరము కళారాధకులకు కళాపోషకులకు బహుమతులు బిరుదముల నొసంగుటయే గాక ప్రత్యేకకళాశాలలను స్థాపించి లలితకళలకుఁ బునర్జీవము కలుగఁ జేయుచున్నారు.

ఇఁక నవనవోన్మేషమైన భావతరంగ డోలికలలో భారతీయ లలితకళలు ఉఱ్ఱూఁతలూఁగుచు, ఉషఃకాలపు బాలభానోదయ కాంతివోలె. ఈ ప్రపంచమున కాదర్శాచరణీయములు కాఁగలవని యాశింపవచ్చును.

---

# "కళ - నీతి"

కళయనఁగా నేమి? కళకు నీతి ప్రధానమా? లేక కళ-కళకొఱకా? కళా ప్రయోజన మేమిటి? ఇవి, దీనిలో చర్చనీయాంశములు.

మానవుఁడు తన జీవితమును సుఖవంతముగను సుందరతరముగను జేసికొనుటకై చేసిన కృషియే కళ. సౌందర్యము నభివ్యక్తీకరించుట కళాధర్మము. లలితకళలు కేవల మానందదాయకమునకే కాని జీవితసౌఖ్యమునకుఁ గాదు. ఒక ఉపయోగ కళావస్తువును నిత్య మనుభవించెదము. ఒక లలిత కళావస్తువు ననుభవించుటయేగాక ఆనందానుభూతిని గూడఁ బొందెదము

ఆత్మానుభూతికిఁ బ్రతిరూపము కళ. నిండుపున్నమి నాఁడు ప్రాక్కాంతామణిగర్భమున నుదయించు నెలబాలుని యందచందములను జూచి యానందింపని మానవుఁ డుండఁబోఁడు. వసంతమున సహకారపల్లవముల సాపేక్షముగా నాస్వాదించి కమ్మని కలకంఠారావములతో నాలపించు కోకిలమ్మ గానమును విని యానందించి యనుకరింపని రసికుఁ డుండఁబోఁడు. కావున మానవునకు సౌందర్యమున్నందున సహజాసక్తియే వాని యానందానుభూతికి హేతు వగుచున్నది. చూచినదాని ననుభవించి అనుభవించినదాని నానందించి, వానిని సమగ్రమగు భావసౌందర్యముతో నంతరంగభిత్తికపైఁ జిత్రించి, తిరిగి దానిని సాధనసంపత్తితో సృష్టించునపుడు కళ యగును. అందుఁ గళ హృదయసంబంధి

కాని బుద్ధిసంబంధికాదు. అతిమేధావు లుండవచ్చును. అనిర్వచనీయు, అద్వితీయు, విజ్ఞానఘనులు కావచ్చును. అంత మాత్రమున వారందఱు కళోపాసకులు కారు. కొందఱుండిన నుండవచ్చును కళాసౌందర్యము నాస్వాదించి యానందించి తత్కళాకారుని భావసౌందర్యముతో సాహచర్యమును బొందుట బుద్ధి విశేషమున జరుగు కృషి కాదు. సహృదయము సాదరము సాభినివేశముల వలన జరుగు సంస్కృతి యని చెప్పవలెను. సామాన్యమానవుఁడు కళాసౌందర్యమును గాంచి అంతటితోఁ దృప్తి చెందును. కళారాధకుఁడా సౌందర్యమును గాంచి తన్మయత్వము చెందుటయే గాక భావావేశముతో నొక ప్రతిబింబమును సృష్టించుటకుఁ బ్రయత్నించును. అదియే కళ.



కళాధర్మములను నిలఁబెట్టుట కళోపాసకుని విధ్యుక్త ధర్మము. సత్య-శివ-సుందరముల నేకత్వముగాఁ బోషించుట వాని యుద్దేశము. సామాన్య మానవునకు గోచరించునది బాహ్యసౌందర్యము మాత్రమే. కళోపాసకులు సత్య-శివ-సుందరములు-మూఁడింటిని గాంచి బ్రహ్మసాక్షాత్కారమునకుఁ దుల్యమగు బ్రహ్మానందమును బొందెదరు, ఈభావమునే Quintilian అనుపాశ్చాత్యకవి 'The learned underst-and the theory of art, the unlearned its pleasure' అను వాక్యములో వచించియున్నాఁడు. కేవలము బాహ్యసౌందర్యమే ప్రధానముగాఁగలకళ, జీవములేని శరీరము వంటిది. సత్య-శివ-సుందరములు మూఁడును లీనమై

యుండునప్పు డది సమగ్రమగు జీవకళతో నుట్టిపడుచుండును. అందును ముఖ్యముగా నూతనత్వముండిన కళకొక కాంతివన్నె తెచ్చును. పాడిన పాటను దిరిగి పాడిన వింతకుబగులు చింత గల్గును. అచ్చుయంత్రమునఁ దీసిన బొమ్మలు నొకటె యందఱొకే విధముగాఁ జిత్రించినచో విచిత్రమేమున్నది? భావ సౌందర్యములోను రచనాసౌందర్యములోను రూపసౌందర్యము లోను ఒక క్రొత్త చైతన్యము ఒక క్రొత్త జీవకళ, ఒక క్రొత్త సందేశము చిప్పిలుచున్నపుడే నిజమైన కళాభివృద్ధి జరిగినట్లగును. కళలో ప్రతివిషయమునను వైవిధ్యము గోచరించిననే గాని సమాజసంస్కృతిలో వైవిధ్యము గోచరింపదు. సంస్కృతిలో వైవిధ్యము లేనియెడల సమాజము పురోగమింపక స్తంభించిపోవును. చిత్రమును జూచి చిత్రమును వ్రాయవచ్చును. ఒక కవి వ్రాసిన కావ్యమును వలె మఱొకరు వ్రాయవచ్చును. పాడినపాటను పాడవచ్చును. అందుచేఁ గళాకారుఁడు ధన్యుఁడు కాఁడు. తత్కృషియు కళ కాదు. 'ఆత్మవేదనోన్ముఖమైన యంతరంగమునఁ బ్రసరించు' నస్పష్ట భావములకు విస్పష్టమైన రూపమును స్వచ్ఛముగా వివిధభంగులఁ జిత్రించువాఁడే నిజమైన కళాకారుఁడగును. తత్కృషియే నిజమైన కళ యగును. అట్టి కళకు శాశ్వతత్వ ముండును.

కళాకారుఁడు తనకళలోఁ బ్రకృతిలోని నిర్మలత్వము ననుపానముగా మేళవించి మానవకోటి కందించును. గాఢానందము చిత్తశాంతి 'విజ్ఞానములతో సమాజ ముత్తేజ

మందును. ఆనందము హృదయవికాసమునకుఁ జిత్తశాంతి విజ్ఞానములు బుద్ధివికాసమునకుఁ దోడ్పడును.

సమాజమును ధర్మపథగామినిగాఁ జేయవలయునన్న ఆనందము చిత్తశాంతి విజ్ఞానము లిచ్చు కళ లవసరము. ఈ మిషచేఁ గళాసౌందర్యమునకు భంగము కలిగిన నది కళ కాదు. నీతి లేక ధర్మ ప్రతిపాదనము కళలో వ్యంగ్యముగ నుండవల యునే కాని వాచ్యముగ నుండరాదు మహాకవు లెప్పుడును దమ రచనలలో నీతిని వ్యంగ్యముగ నిక్షేపింతురు. ఒక వేళ నట్టి నీతి వచింపక పోయినను కళాభంజకము కాదు కాని యది 'యుత్తమకళ' యనిపించుకొనదు.

వ్యంగ్యముగఁ గాని వాచ్యముగఁ గాని కావించు నీతి బోధ కళకుఁ గళంకమనియు, కళాసౌందర్యమే ప్రధాన మనియు, కళకు హృదయవికాసమే ముఖ్యమనియు వాదించు నతితీవ్రవాదులు పాశ్చాత్యులలోఁ గొందఱు కలరు. వీరిది కేవలము రససిద్ధాంతము Aesthetic school. 'కళ – కళ కొఱకే సృజింపవలయును (Art for arts sake-Victor cousin) కాని, లోక నీతికొఱకుఁగాదు. శిల్పనీతి ప్రధా నమై యుండవలయును. అప్పుడే కళకుఁ బరిపూర్ణత్వము శోభ వచ్చినట్లగు'నని స్విన్‌బారన్ – రూసో – విక్టర్ కజిన్ మున్నగువారి వాదము. వీరిని జూచి ప్రాచ్యులు కొందఱు 'కళ–కళకొఱకే' యంచు తాళము వేయసాగిరి. వీరి సిద్ధాం తమును జాలమంది యంగీకరింపరు. ఇందుచే సమాజ ముత్తేజ

విజ్ఞానములతోఁ బురోగమింపక జడపదార్థమువలె నిశ్చలమై పోవును. కళకు శిల్పనీతియే (సౌందర్యమే) ప్రధాన మయి నపుడు ఒకరికి రుచించిన సౌందర్యము మఱొకరికి రుచింపదు కదా! అప్పుడాకళ ప్రయోజన మేమిటి? స్త్రీకి కేశములు పొడవుగా నుంగరముల వలె మెలికలు తిరిగి తుమ్మెద ఱెక్కలవలె నల్లగా నుండిన అట్టి సౌందర్యమును జూచి కొందఱు ముగ్ధులయ్యెదరు. మఱి కొందఱు పొట్టిగా జులపాలుండిన తన్మయత్వము చెందెదరు. 'కాపును' జూచి కౌఁగలించుకొనువారు కొందఱుండెదరు. దొంగకు దొంగతనమును గుఱించి చక్కఁగా వర్ణించునపుడే సంతోషము. ధర్మమును వర్ణించిన నతడు చికాకుపడును తత్త్వజ్ఞానికి పరమాత్మవర్ణనమే రుచించును, గాని నాయికానాయకుల శృంగారలీలలు రుచింపవు. యుద్ధవీరుఁడు యుద్ధవర్ణనమే ప్రస్తుతించును. గాని కరుణగాథను గాదు. కాఁబట్టి 'కళకు సౌందర్యమే ప్రధాన' మనుట కేవల మనుచితము-అసహజమును సుందరముగా నున్నదని శిశువు అగ్నిని పట్టుకొనినట్లగును. ఇందువలన సమాజమునకు హానియేకాని జ్ఞానదాయికాదు కావున సమాజమునకుఁ దన కళద్వారమున సందేశము నిచ్చువాఁడు కళాకారుఁడు. ఆ సందేశము సర్వకాల దేశ పాత్ర ప్రయోజనమై యుండును. కాని కొందఱి యభిమాన నిరభిమానములతో నిమిత్తములేదు. నిరాశకు బదులు ఆశను, అజ్ఞానమునకు బదులు విజ్ఞానమును, భయమునకు బదులు-అభయము నిచ్చునదిగా నుండవలయును. కళ

దైవ నిర్మితము కాదు. అది వ్యక్తియొక్క ప్రజ్ఞావిశేషము. కావున తన ప్రజ్ఞావిశేషముచే జనించు కళ సమాజమునకు, హృదయ బుద్ధి వికాసము లేక కాలమున నుద్బోధించునదిగా నుండవలయును,

కొందఱు కేవలము 'Philosphy first and poetry next' అను వితండవాదము చేయువారును గలరు. అనఁగా వీరికి ధర్మ ప్రతిపాదనమే ప్రధానమై యుండవలయును. హృదయవికాసముకంటె చిత్తశాంతి విజ్ఞానము వీరికి ముఖ్యములు 'No poem ever makes me respect, its author, which does not in some way conveys a truth of philosphy - Lowell. తాత్త్విక సత్యమును ప్రతిపాదింపని కవిపైఁగాని, తత్కవికృతమగు పద్యముపైఁగాని నాకెప్పుడట్టి గౌరవభావము లేదని వీని యుద్దేశము. ఇట్టి తెగకుఁ జెందినవారే కాలరిడ్జి, బ్రౌనింగు, మున్నగువారు.

టాల్‌స్టాయ్, అర్నాల్డు, మున్నగువారు శిల్పనీతి - లోకనీతికంటె భిన్నముకాదని స్పష్టపఱచినారు. (Artistic beauty is not different from moral beauty-Tolstoy) లోకనీతిని బోషించుటయన శిల్పనీతిని బోషించుటయే యగును. కావున మానవజీవిత పురోగమనమునకు రెండును ముఖ్యములే యని వీరి యుద్దేశము,

ప్రత్యక్షముగా సంఘనీతికి విరుద్ధములుగా గోచరించినను కళలో తత్కళాకారుఁ డేదియో సత్యము నిమిడ్చియే

యుండును. పచ్చి శృంగారగీతములు వినుటకు వెగటుగా నున్నను, కృష్ణపరమాత్మ నుపాసించుట - ఆ పరమాత్మను సాక్షాత్కరింపఁ జేసికొని బ్రహ్మానందము నొందుట యిట ప్రధానకర్తవ్యము. పరదార నపహరించుట పాపమని ప్రాణాంతకమని బోధించుటకే జానకీరాములయు వాలిసుగ్రీవులయు కథలను మహాకవులు గ్రహించిరి. అన్నదమ్ముల యాస్తి నపహరించుట వినాశహేతువని సందేశ మిచ్చుటకు భారతము బయలుదేఱినది.

కావున మహాత్ములు వ్యర్థముగాఁ దమ ప్రజ్ఞను ధార వోయరు. 'విశ్వశ్రేయః కావ్య' మనినట్లు సమాజశ్రేయస్సునకే తమ శక్తి నుపయోగించెదరు. కళవలనఁ గలుగు సంఘసంస్కారమును బట్టి యా కళాకారులస్థానము నిర్ణయింపవచ్చును. ఈ సూక్తిని ఎమర్సన్ ఇట్లభివ్యక్తీకరించెను. 'Great poets are judged by the frame of mind they induce in us.' ఎవరైన కళాపరిశీలనము వలనఁ జిత్తసంస్కారమునకు బదులు దుర్నీతిపరులుగాఁ దయారైనచో వారి గ్రాహకేంద్రియములలోఁ (senses) గాని. పరిశీలనాపద్ధతిలోఁ గాని ఏదియో లోప ముండితీరును. మహాకళాకారు లెప్పుడును దుర్నీతిని బోషింపరు. నీతిదాయకము గాని కళ రసానందభూతము కాదు. అందుచే - ఆభాసమే కాని రససిద్ధి కలుగదు అట్టి కళాజీవితము బుద్బుద ప్రాయము. వేలకొలఁది సంవత్సరములనాఁటి 'అజంతా' చిత్రములు, 'ఎల్లోరా' శిల్ప ఖండములు, నాగార్జునుని కొండ

కడ బయల్వెడలిన విగ్రహములు, మధుర-మహాబలిపురము-కంచి - కాళహస్తి మున్నగు పట్టణములయందు మహా రాజులు దేవాలయముల యందుఁ జిత్రింపఁజేసిన శిల్పమును జూచి, నేఁటికిని దేశ విదేశ ప్రజలు తన్మయత్వముతోఁ బ్రస్తుతించుటకుఁ గారణమేమి? ఆ నాఁటి కళలో నాఁటి సంఘ సంస్కృతి యంతయు నిబిడీకృతమైయున్నందుననే. ఒక నాఁటి జాతియొక్క ఉత్కృష్టనికృష్టదశలకు శాశ్వతత్వమును జేకూర్చునది యీ కళలే. పూర్వకాలములో భారతదేశపు సంస్కృతి యెంత మహోన్నత స్థితిలో నున్నదో ఈ కళలు నిరూపించుచున్నవి పాశ్చాత్యు లనేకులు వీనిని జూచి 'భారతీయ సంస్కృతి అతిపురాతన కాలముననే అతిమహోత్కృష్ట దశను బొందిన' దని వాక్రుచ్చిరి.

కళ యెంత ధర్మప్రతిపాదనము చేసిన నాఁటి జాతీయ జీవిత మంత యుత్కృష్టదశలో నుండును నీతిప్రతిపాదనము లేని కళాభివృద్ధి జాతీయజీవనమునకుఁ గళాహీనమగు కృష్ణ పక్షము వంటిది. కావున కళారాధకులు నవనవోన్మేషమగు భావచైతన్యముతో వైవిధ్యముతో ధర్మప్రతిపాదనముతోఁ గళ నభివృద్ధి పఱచిన, నాఁటి సమాజము చైతన్య సహితమై దేవనది వోలె పవిత్రమై సెలయేటువలె ముందునకు విస్తృతమై పరుగులిడును నీతిలేని కళాజీవితము నీతిలేని భార్యతోఁ జేయుసంసారజీవితము వంటిది. సమాజమునకు సుతేజము చైతన్యము గలిగించి తారాపథమున నడిపింపవలయునన్న కళాకారుఁడే చేయవలయును.

"కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, రూపే చ లక్ష్మీ
క్షమయాధరిత్రీ
భోజ్యేషు మాతా, శయనే చ రంభా షట్కర్మయుక్తా ఖలు
ధర్మపత్నీ"

పైశ్లోకమున భర్తకు భార్య బహుభంగుల సహకరించి నట్లు సమాజమునకుఁ గళ బహువిధముల మేలు కూర్పవల యును. సమాజ మిటు ఇహలోక సుఖసౌందర్యములను అటు పరలోక సౌభాగ్యమును గాంచి తరించుటకు మార్గము కళయే కదా! కళ-కళకొఱకే కాక నీతి ప్రధానమై యుండినపుడు అవి సిద్ధించును. అట్టికళ సర్వజన శ్రేయోధాయకమై సర్వ దేశసౌభాగ్యమునై సార్వకాలికమునై విలసిల్లును.



# 'భారతీయ సంస్కృతీ సాహిత్యములు'

ప్రపంచములో నేజాతికి నేదేశమునకు లేని సంస్కృతీ సాహిత్యములను భారత దేశ మతిప్రాచీన కాలముననే గడించి యున్నతోన్నతమైన స్థితిని బొంది ప్రాచ్య పాశ్చాత్య పరిసర దేశములకు బరమాదర్శప్రాయమై యనుసరణీయమై ప్రసిద్ధిని బొందినది. అట్టి యుత్కృష్టమైన సంస్కృతీసాహిత్యములఁ జాటుట కతిప్రాచీనములయిన వేదములు - వేదాంగములు - హరప్పా - మొహంజదారో పట్టణములయునికి - పురాణములు - రాజశాసనములు - బౌద్ధస్తూపములు - విదేశయాత్రికులు రచించిన గ్రంథములు మున్నగునవి మన కాధారములు.

నేఁటికిని ఆర్యసంస్కృతిని జాటుచు హైందవధర్మములకు మార్గదర్శకములై యలరారుచు ప్రాచీనములు పవిత్రములునైన వేదములు మనకుఁ బ్రమాణములు. అనేక సంప్రదాయముల చేతను భిన్నవిభిన్నములయినసంస్కృతులతోడను అస్తవ్యస్తమగుచున్న భారతజాతి నేఁడు కూడ వేదములను బూజ్యభావముతోఁ బ్రస్తుతించుచున్నది. 'తిలక్' మహాశయుఁడు జ్యోతిర్గణితముల నాధారముగాఁ గైకొని 'వేదములు క్రీ. పూ. 6 వ. శ. నాఁటి' వని విశదీకరించెను. పాశ్చాత్యకవి, ప్రొఫెసర్ వింటర్ నిట్జ్ 'వేదములు క్రీ. పూ. రెండు మూఁడు శతాబ్దములలో వెలువడిన' వని వ్యక్తపఱచెను. వేద మీశ్వరప్రణీత సాహిత్య మనియు,

సృష్ట్యాది నిది యుదయించెననియు. దయానందులయు సాయణ భాష్యకారులయు మతము. వేదకాలమునాఁటి మన సంస్కృతీ సాహిత్యములతోఁ దుల్యమగు జ్ఞానసంపాదనము పాశ్చాత్యులకు లేదు. గతశతాబ్దమునుండి పాశ్చాత్య విద్వాంసులు మన ప్రాచీనభారతీయసంస్కృతీసాహిత్యముల నవగాహనము చేసికొని వేనోళ్ళ ప్రపంచమునకుఁ జాటు చున్నారు డాక్టరు హెచ్. హెచ్. విల్సన్. ఋగ్వేదము నాంగ్లమున ననువదించి గొప్పగా స్తుతించెను. 'రోజన' యను విద్వాంసుఁడు ఋగ్వేదములోని ప్రథమాష్టకమును 'లాటిన్' భాషలోని కనువదించెను. అనేకులు మన శాస్త్రముల నవగాహము చేసికొని యనుసరించిరి. నేఁడు పాశ్చాత్య దేశములయందలి విశ్వవిద్యాలయములలో సంస్కృతశాఖ నేర్పాటు చేసి సంస్కృత గ్రంథముల మననము చేయు చున్నారు.

వేదకాలమున జాతి మత భేదములుగాని దేవాలయములుగాని విగ్రహారాధనము కాని ఉపాసనముగాని యుండె డిదికాదు. గృహపతి ఒకవైపు యజ్ఞయాగాదులను నిర్వహించుకొనుచు మఱొకవైపు ధనధాన్యాదులను సంపాదించి, భార్యాపుత్రులతో - బంధుమిత్రాదులతో సుఖానందములననుభవించెడివాఁడు. వ్యవసాయమే ముఖ్యవృత్తి. యవలు గోధుమలు ముఖ్యమైన పంటలు. ఆవు - ఎద్దు - గుఱ్ఱము మున్నగు సాధుజంతువులను దమ కుపయోగించు జంతువులను మచ్చిక చేసికొని పోషించుచుండెడివారు. ఋగ్వేదములో

నొక సూక్తిలో క్షేత్రపతిని గురించి గొప్పగాఁ బ్రస్తుతింపఁ బడియున్నది.

ఇందువలన నా కాలమున వ్యవసాయము ముఖ్యవృత్తి గాను పవిత్రలక్ష్యముగాను మిక్కిలి ప్రచారములో నున్నట్లు మనకు స్పష్టమగుచున్నది. నూలు తీయుట నూలు-ఉన్ని దుస్తులను దయారుచేయుట కుటీరపరిశ్రమలుగా నుండెడివి. వారికి బాణము బల్లెములు మున్నగునవి ముఖ్యాయుధములు. వేదకాలపు ప్రజలకు సముద్రమును సముద్రయానమును గురించి మిక్కిలి యనుభవము గలదు వర్తకవాణిజ్యము లలో నతిప్రావీణ్యమును గడించి యథాతథముగ వస్తు వినిమయము గావించుచుండెడివారు. సుందరమగు రథము లను జేయుటయందును. స్వర్ణాభరణ రచన యందును, లోహశస్త్రాస్త్ర నిర్మాణమునందును వారు మిగుల నేర్పరులు ఋషులు వర్ణవిభేదము లేక సామాన్యులతోడ నైనను వివాహసంబంధములు నెఱపుచు, సదాచారులగు గృహ స్థులు వోలె భార్యాపుత్రులతో ధనధాన్యములతో సుఖించు చుండెడివారు.

ఆ కాలపు స్త్రీలు పురుషులతో సమానప్రతిపత్తిని బొంది యజ్ఞయాగాదులలో భాగము వహించుచుండిరి. ప్రసిద్ధి చెందిన తపస్వినులు విదుషీమణులు అనేకప్రసిద్ధ గ్రంథములను వ్రాసి పురుషులతో వాదోపవాదములు జరిపి సమానప్రతిపత్తిని బొంది యుండిరి. విసవారే (Visavare ఘోష (Posha). అపాలా (Apala) మొదలగువారు వేద

మంత్రములను సంకలనము చేసినట్లు గలదు. గృహిణులు చతురలై గృహపరిశ్రమల యందభిరుచి గలిగి గృహపతికి సహాయము చేయుచుండెడివారు, రాజులు ధనవంతులు బహు భార్యాత్వము నెఱపుచుండెడువారు. వేదకాలపు ప్రజలు మానవజీవితమును నాలుగు భాగములుగ విభజించుకొనిరి. మొదటి 25 సంవత్సరములవఱకు బ్రహ్మచర్యము; ఈ కాలములో గురుముఖమున వేద వేదాంగములను బహుశాస్త్రములను అధ్యయనము చేసి గాని, లేదా యేదో కళను నేర్చిగాని భావిజీవితములో భార్యాపుత్రులను బోషింపఁగల శక్తి సామర్థ్యములను సంపాదించెడివారు. 25 నుండి 50 సం॥ లో గృహస్థ ధర్మమును నిర్వహించెదరు. 50 నుండి 75 సం॥ వఱకు వానప్రస్థము; ఈ కాలమున సంసారమును బిడ్డలకు అప్పఁజెప్పి, భార్యతోఁగాని ఒంటరిగాఁగాని వనమున కేగి జపతపములతోఁ గాని లేక మునీశ్వరుల చెంతఁజేరి వారి బోధనలను వినుచు, విశ్రాంతిని దీసికొనెదరు. 75 నుండి 100 సం॥లో తుదకు సన్న్యాసము పుచ్చుకొనెదరు. ఈ కాలమున నైహికసుఖాదులను వదలి అలౌకికసుఖమునకై పాటుపడెదరు. చతుర్విధ పురుషార్థములగు ధర్మార్థ కామమోక్షములను వేదకాలపు ప్రజలు క్రమపద్ధతిలో ననుష్ఠించెడివారు.

ఉపనిషత్తుల కాలమునాఁటి కార్యులు పూర్తిగా నుత్తర హిందూస్థానము నాక్రమించి దక్షిణప్రాంతమునకు బయలు దేరిరి. బ్రాహ్మణ క్షత్రియులలోఁ బరస్పరాధిక్యమును గుఱించి మనస్పర్థలేర్పడెను. క్షత్రియులు సువ్యవస్థితములగు

రాజ్యముల స్థాపించిరి. ఆర్యులచేఁ దఱుమఁ బడిన ద్రావిడు లుత్కృష్టమైన సంస్కృతిని గలిగియున్నప్పటికి ఆర్యులు ద్రావిడులకంటె గొప్పవారమని భావించుచుండెడివారు. 'దేశ దిమ్మ'రులు గిరిజనులు అనాగరికులు ద్రావిడులలో నున్నను ఆనాఁడు పాశ్చాత్యదేశములలో నున్నట్లు మనదేశములో బానిసతనము లేదు.

ఆర్యులకు మొదటినుండి వ్యవసాయమే ముఖ్యవృత్తి. అది సర్వవృత్తులలో నుత్తమము, పవిత్రమైన దని వారి భావము. ఆర్యులు, అనార్యులను భేదముతోనే వర్ణవిభేదము లుత్పన్నమైనవి. ఆర్యులు, వరుణ-సూర్య-అగ్ని-ఇంద్రాదు లను బూజించెడి వారు. ద్రావిడు లా రోజులలో భూమిని చెట్లను పాములను గొల్చెడివారు. ఆర్యుల భాష దైవదత్త మని, ద్రావిడభాష మానవకృతమని వారిభావము. కాల ప్రవాహములో నార్యులు ద్రావిడులు సంస్కృతీసాహిత్య ములను నాచారవ్యవహారములను ఆహారపానీయములను వేష ధారణము నన్యోన్య మనుకరించుచు నాచరించుచు నేఁడు గుర్తింప లేనంత సన్నిహితసంబంధముల నెఱపుకొని.

స్మృతుల తరువాత చరిత్ర కాధారమైనంతవఱకు భరతఖండములో భారతీయుల సంస్కృతిని దెల్పునది సింధు లోయ నాగరికత. ఇది భూమిలో వెలువడిన పురాతన మానవుల చరిత్ర. సింధులోయలో 'మొహంజదారో', పడమటి పంజాబులో 'హరప్పా', అను పట్టణములు త్రవ్వకములలో బయట పడినవి. ఇవి క్రీ.పూ. రెండుమూఁడు శతాబ్దముల

మధ్యకాలము నాటివని చరిత్రకారులు ఋజువు పఱిచి యున్నారు. ఈ రెండుపట్టణములకు మధ్య చాలదూరము కలదు. వీనిని త్రవ్వించి పరిశీలించిన సర్ జాన్ మార్షల్ 'లతులాది ప్రజల ప్రయత్నముచే నిర్మింపఁబడినట్టియు, శాశ్వతమైనట్టియు నాగరికత యీ పట్టణములలో ద్యోతకమగుచున్నది. ఆనాటి పర్షియా, మెసపొటేమియా, ఈజిప్టు దేశములతోఁ దుల్యమగు నాగరికతను భారతదేశ మేనాఁడో సృష్టించుకొని యభివృద్ధిపఱచుకొనినది. కొన్ని కొన్ని విషయములలో మెసపొటేమియా, ఈజిప్టుదేశములను గూడ మించియున్న'దని వ్యక్తపఱిచెను. మొహంజదారో పట్టణమునఁ గన్పట్టు విశాల భవనములు, స్నానపుగదులు, సమావేశశాలలు ఈజిప్టు, మెసపొటేమియా, పశ్చిమాసియా దేశములలో నెచ్చటను గన్పట్టవు. పై దేశములలో రాజులు ప్రజలను బీడించి యంతఃపురముల నిర్మించుకొని యందు మహావైభవము ననుభవించుచుండగా, ప్రజలు మట్టికొంపలలో నికృష్టజీవితమును గడపెడివారు. హరప్పా, మొహంజదారో పట్టణములలో రెండంతస్తులు గల ప్రత్యేకభవనములు కూడఁగలవు. గోడలను రాయి మట్టి కాల్చిన యిటుకలతో నిర్మించిరి. భవనకుడ్యములకుఁ జిత్రములను వ్రాసిరి. స్నానపుగదులు సమావేశశాలలు ద్వారపాలకుని గది ప్రత్యేకముగా నుండును. సరస్సులు పూలతోఁటలు పండ్లతోఁటలు వారి వినోద స్థలములు. ఇచ్చట ననేకశిల్పములు బంగారు నాణెములుకూడ బయటపడినవి. రాజ

మార్గములు ఆ మార్గముల కిరువైపుల మురుగుకాలువలు, అచ్చటచ్చట మురికివాడ్లు ప్రభుత్వపు బావులు సత్రములు నుండినవి స్త్రీలు పురుషులు నాభరణముల ధరించెదరు. వీనిని బంగారము వెండి దంతములతోఁ దయారు చేసికొనెదరు. దంతముతో దువ్వెనలు-సూదులను- రాగి ఇనుములతో కత్తులు - గొడవళ్ళు - గొడ్డళ్ళు - గాలములు మున్నగు వానిని తయారు చేసికొనెదరు. ఇచ్చట త్రవ్వకములలో నేనూటు బంగారపు వెండిముద్రిలు దొరికినవి. వానిపై వివిధములైన జంతువుల బొమ్మలు చక్కఁగాఁ జెక్కఁబడినవి. ఈముద్రిల నెక్కువగా వర్తకవాణిజ్యములం దుపయోగించెదరు. హారప్పా పట్టణములోఁ గొన్ని విగ్రిహములు బయటపడినవి. అవి గ్రీకుల విగ్రిహములను దలఁపింపఁ జేయుచు నాఁటి శిల్పకళానైపుణ్యమును జాటుచున్నవి. ఒకవైపు తమస్థానిక వ్యాపారము నభివృద్ధిపఱచుకొనుచు, మఱొకవైపు సుమేరియా, మెసపొటేమియా, దేశములతో వాణిజ్యము నెఱపుచుండెడివారు. ఆ ప్రజల మతాచారము నాఁటి యితరదేశప్రజల మతాచారమును బోలియుండును. నేఁటి-నాఁటి నాగరికతల కెంతో కాలవ్యత్యాస మున్నను, నాఁటి నాగరికత నేఁటి భారతీయులలో నంతర్లీనమై కన్పట్టును. యజ్ఞయాగాదుల యందలి కర్మకాండ పరిశ్రిమలయందలి పనితనము వేషభాషలయందలి యింపు సొంపులు భారతీయులకుఁ బుట్టుకతో వచ్చిన విద్యలు. నాఁటి భారతీయుల ప్రభావమే పశ్చిమాసియా వాసులకును సోకినది. ఈ సింధు

లోయ నాగరికతకుఁ గారకులైన ప్రజలెవరో యింతవఱకుఁ దెలియదు. కాని యట్టి సంస్కృతి దక్షిణభారతీయులలోఁ గన్పట్టును మొహంజదారో, హరప్పా, పట్టణములు విల సిల్లిన సహస్రవర్షముల కార్యలీ ప్రాంతమును జేరి, ప్రాచీన భారతీయ సంస్కృతికి మూలపురుషులైన ద్రావిడులతో సంబంధబాంధవ్యముల నెఱపిరి. తరువాత కాలములో ఇరా నులు, గ్రీకులు. పార్థినులు, బాక్ట్రియనులు, సింధియనులు, హూణులు, టర్కీవారు, యూదులు, జోరోస్ట్రియనులు, వచ్చి సర్వనదులు సాగరమున లీనమైనట్లు. భారతీయ సంస్కృతిలో లీనమైపోయిరి. ఈ భావమునే పాశ్చాత్యులు కూడ వ్యక్తపఱచిరి.

'India was infinitely absorbent like the ocean' - Dodwell.

'సింధు' అను పదమే హిందు అయినది. ఈ 'హిందు' పదము మనప్రాచీనసాహిత్యము (వేదాదుల)లో మృగ్యము. క్రీ.శ. 8 వ. శ. లో వెలువడిన యొక తాంత్రిక గ్రంథములో మాత్రి మీా పదము గన్పట్టును. అదియైనను 'హిందూ మతము' పేరిటఁగాదు. కేవలము ప్రజల కన్వయించి వాడఁ బడినది' క్రీ. శ. 7 వ. శ. లో మన దేశమునకు వచ్చిన చైనా యాత్రికుఁడు ఇట్సింగ్, తన గ్రంథములో ఔత్త రాహులు నివసించు మధ్యభారతమును సింతు (Hsin - tu) యని పేర్కొనియున్నాఁడు. దీనినే అర్యదేశ (Noble land) మనుట యుత్తమమనెను. అందుచే 'హిందు' అను పదము

మొదట దేశవాచకమై ప్రజావాచకమై, తుదకు మతమునకుఁ గూడ సమన్వయమైనది.

ప్రాచీనకాలమున భారతీయుల మతము 'ఆర్యధర్మ' మనుచుండెను. ఇది నిజమునకు నేఁటి మహమ్మదీయ-క్రైస్తవ మతములవంటిది కాదు. కొంత భిన్నత్వము గోచరించును. తన బాధ్యతలను దైనిక విధిని నైతికముగా నిర్వహించుట మానవధర్మము. దీనినే 'ఆర్యధర్మ' (The duty of a noble man) మందురు. ఈ ధర్మమును వేదములు స్పష్టముగా నిర్వచించినవి. దైవస్తుతి - దైవప్రార్థనము - యజ్ఞయాగాదులందలి కర్మకాండ-నీతిబోధలు - వేదాంతచర్చలు-జీవనోపాధి మున్నగు సర్వవిషయములు సర్వమానవాళి కత్యవసరమైనట్లు వేదములు ఘోషించినవి. 'సనాతనధర్మ' మనఁగాఁ బ్రాచీన మతమని యర్థము. అనఁగా వైదిక బౌద్ధ జైన మతములలో నేదైనఁ గానచ్చును. కేవల మొక మతము నంటి పెట్టుకొని మూఢవిశ్వాసములతో, పూర్వాచారపరాయణులై ప్రవర్తించు ఛాందసులైన హిందువులకు నేఁడీ పదము వాడఁబడుచున్నది బౌద్ధ జైన మతములు భారతదేశమున జనించినను, వానిని వ్యాప్తిలోనికిఁ దెచ్చినది భారతీయులైనను ఈ మతమునకును 'హిందూమతము' నకును భిన్నత్వము గోచరించును

'హిందూమత' మనఁగా నేమో నిర్వచించుట కష్టతరమైన విషయము. అది సర్వమానవాళికి సర్వవిధముల సంబంధించి. సందిగ్ధముగా నుండునట్టి మతము. పదమును

బట్టి చూడగా నిది మతమా? దేశమా? ప్రజలా? ఏమైనది కచ్చితముగాఁ జెప్పుట దుర్లభము. ఏమయినప్పటికిని స్వజీవన పరజీవన శ్రేయస్సే హిందూమతము యొక్క ముఖ్యోద్దేశము. మహాత్మ గాంధి హిందూమత మనఁగా నేమో? ఇట్లు వివరించి యున్నాఁడు,

'If I were asked to define the Hindu creed, I should simply say, search after truth through non-Violent means A man may not believe in god and still call himself a Hindu. Hinduism is a relentless pursuit after truth. Hinduism is the religon of truth. Truth is god Denial of god we have known, Denial of truth we have not known.

దైవ విశ్వాసము గలవాఁడు, లేనివాఁడును హిందూ మతములో నుండవచ్చును. హిందూమత' మనఁగా సత్యము. 'అహింస' యే పరమధర్మముగా నాచరించుచు నీ సత్యమును గనుగొనవలెను. సత్యమే దేవుఁడు. దేవుఁడు లేఁడనుట మన కందఱకుఁ దెలిసిన విషయమే కాని 'సత్యము' లేదనుట మన మెఱుఁగము కాఁబట్టి హిందూమతమునకు 'సత్యంవద' 'ధర్మంచర' అనునవి ముఖ్యలక్షణములు. ఎందఱో విదేశీయులు, విభిన్న మతములతో, వివిధ సంస్కృతులతో, వివిధయుగములలో వచ్చి చేరుచున్నను, సర్వనదులను భరించు రత్నాకరము వోలె హిందూమత సాగరము చలింపక గంభీరమై, గూఢమై యింక నెందఱినో ఆకర్షించుచు నెగడుచున్నది

పురాణయుగము నాఁటికి వర్ణవ్యవస్థ స్థిరపడి, రాజులచే వర్ణాశ్రమధర్మములు రక్షింపఁబడుచుండెను. ఆదికాలమున పరమేశ్వరుఁ డాధ్యాత్మిక సంపత్తిగల బ్రాహ్మణులనే మొదట సృష్టించెననియు, నప్పుడు సత్యము - ధర్మము - ప్రధానమనియు, వారిలోఁ గొందఱు కామ భోగ పరాయణులై సాహసకార్యములం బూని స్వధర్మాచరణము మాని నందున క్షత్రియులైరనియు, మఱికొందఱు గోవులను బెంచుచు, వ్యవసాయము - వాణిజ్యము మొదలగు వృత్తుల నవలంబించుటచే వైశ్యు లయిరనియు, కొందఱు శౌచపరిభ్రష్టులై హింసావలంబకులై - సర్వకర్మోప జీవులైనందున శూద్రులైరనియు-భృగు, భరద్వాజులకు జరిగిన సంవాదమును బట్టి తెలియుచున్నది. ఈ భావమునే మహాభారతారణ్య పర్వములో యుధిష్ఠిరుని గూర్చి వైశంపాయనుఁ డిట్లు చెప్పియున్నాఁడు.

"న కులేన జాత్యా వా క్రియాభి ర్బ్రాహ్మణో భవేత్
చండాలోఽపి హి వృత్తస్థో బ్రాహ్మణ స్స యుధిష్ఠిర॥
ఏక వర్ణ మిదం పూర్వం విశ్వ మాసీద్యుధిష్ఠిర
కర్మ క్రియా విశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితం॥
సర్వే వై యోనిజా మర్త్యా స్సర్వే మూత్ర పురీషిణః
ఏకేంద్రి యేంద్రియార్థశ్చ తస్మా చ్ఛీల గుణైర్ద్విజః॥

ఓ ధర్మరాజా! కులము చేతను బుట్టుకచేతనుగాదు, కార్యముల చేతనే బ్రాహ్మణుఁ డగును. సత్ప్రవర్తనము సద్గుణములు కలవాఁడు చండాలుఁడైనను బ్రాహ్మణుఁడగును

పూర్వ మీ ప్రపంచమంతయు నేకవర్ణముతో నిండియుండెను. కర్మక్రియావిశేషములచేత చాతుర్వర్ణ్యముగఁ బ్రతిష్ఠింపఁ బడినది. నరులందఱు యోనినుండి జన్మించినవారె. అందఱును మూత్రపురీషములు గలవారె. ఏకవిధమైన యింద్రియములు, తత్ప్రయోజనములు గలవారె. కావున సదాచార సద్గుణ వంతుఁడు ద్విజుఁడనఁబడును. ఇది పై శ్లోకములకు భావము. దీనిని బట్టి పూర్వ మొకే జాతి యుండెడి దనియు; కాని వారి మానసిక ప్రవృత్తి, దైనిక జీవనోపాధిని బట్టి కుల మతము లేర్పడెననుట స్పష్టము.

మహోన్నతమైన భారతీయ సంస్కృతిని దెల్పు సాహిత్య మంతయుఁ బూర్వము తాళపత్రములు భూర్జపత్రములపై వ్రాయఁబడి కాలప్రవాహములోఁ గొంతయు, మూఢ విశ్వాసముగల మతప్రచారకులచేఁ గొంతయు నాశనమైనది. కొంతవఱకు వాని యనువాద గ్రంథములు చైనా, టిబెట్టు, భాషలలో మనకు లభ్యము లగును. చైనా, గ్రీకు, అరబ్బీ, దేశములలో వలె పూర్వము మనదేశములోఁ జరిత్రకారులు లేకపోవుట మన దురదృష్టము. అందుచే భారతీయ రాజకీయార్థిక సాంఘిక సాంస్కృతిక మత నైతిక సారస్వతాభివృద్ధి యే యే కాలమున నెట్లు విలసిల్లినదో నిర్ణయించుట దుర్లభ మగుచున్నది. క్రీ. శ. 12 వ. శ. లో మాత్ర మొక్క చారిత్రిక గ్రంథము వెలువడినది. దానిపేరు 'రాజతరంగిణి' కాశ్మీరచరిత్రము నాధారముగాఁ గైకొని 'కల్హణుడు' దానిని రచియించెను. మనకు సామాన్యముగా శాసనములు, నాణె

ములు, రాజముద్రలు, సంస్కృతేతిహాసములు, సమకాలికులైన యాత్రికుల గ్రంథములు కాలనిర్ణయమున కాధారములు.

భారత రామాయణాదుల కాలనిర్ణయము బహుకష్టతరము. ఈ గ్రంథములు బౌద్ధ జైన మతములకు ముందె మిక్కిలి వ్యాప్తిలోనికి వచ్చినవి. ప్రాచీన భారతీయ సంస్కృతీ సాహిత్య వైభవములను జాటుటకు నీ రెండు నద్వితీయములె. మనకుఁ గల అష్టాదశ పురాణము లే భాషలో నే జాతికిని లేవు. అన్నియు సంస్కృతభాషలో నించుమించుగ నొకే కాలములో జనించినవి. ఫ్రెంచి చరిత్రకారుఁడు మిచలెట్ 1864 లో రామాయణమును గురించి యిట్లు గొప్పగాఁ బ్రస్తుతించెను.

'రామాయణమున నిర్వ్యాకులమైన శాంతమే పాలనము. కలహములోఁగూడ నపారమైన మాధుర్యము, అనంతమైన సౌభ్రాత్రము గోచరించును. ఈ భావములే ప్రజలలోఁ గూడఁ బూర్తిగా నిండిపోయినవి. ఇందు నెక్కడఁ జూచిన నంతులేని ప్రేమ అనంతమైన కరుణరసము, అపారమైన సానుభూతి తొణికిసలాడుచుండును.

భారతమును 'విజ్ఞానసర్వస్వ'మని (encyclopaedia కూడఁ జెప్పవచ్చును. ఆ నాఁటి సాంఘిక ఆర్థిక రాజకీయ మత సాంస్కృతిక సారస్వత సంస్థల చరిత్రను దెల్పు విజ్ఞాన కోశ మిది. అట్టి విజ్ఞాన కోశము కనుకనే, ప్రళయ కాలము నంబోలె దొకవైపు ద్వితీయ ప్రపంచయుద్ధమున మారణ

హోమము జరుగుచుండఁగా నొకవైపు రష్యా పండితు లీ భారతమును దమ భాషలోని కనువదించుకొనిరి

ఈ దేశమును మొదట భరతుఁడను మహారాజు పాలించెను. ఈతని వంశచరిత్రము దెల్పునదియే మహాభారతము. వీరు పాలించిన దేశమును భరతవర్షమందురు. దీనినే పూర్వమార్యావర్తమనిరి. పూర్వ మార్యులు మధ్యప్రదేశమును బూర్తిగా నాక్రమించి వింధ్యపర్వతములవఱకు వ్యాపించి యుండిరి. కాని రామాయణ గాథ వలన నార్యులు వింధ్య పర్వతములను దాఁటి దక్షిణహిందూస్థానమును గూఁడ జేరి నట్లు స్పష్టమగుచున్నది. భారతమును క్రీ. పూ. 14 వ శ.లో రచించి నట్లు చరిత్రకారు లూహించుచున్నారు. ప్రపంచములో నింతబృహద్గ్రంథ మే భాషలోఁ గాని యే దేశములోఁగాని యింత ప్రాచీనకాలమున వెలువడి యుండలేదు. ఈ మహాగ్రంథములో భావ రూప రచనా సౌందర్య విశేషములు వినుతింపఁదగినవి. నైతికాధ్యాత్మిక సిద్ధాంతములను బోధించు శ్రీకృష్ణభగవానుని గీతావళికూడ నిందుఁ గలదు. న్యాయము ధర్మము సత్యము ఈ మూఁడు గుణము లిందు సర్వత్ర కనబడును. బంధుమిత్రాదులు, కులమతములు, శాశ్వతములు కావు. 'ఎన్నఁటికైనను ధర్మమే జయించును. ధర్మమే శాశ్వతముగా నిలుచును' అను నీతి నుపదేశించును.

భారతకాలమున వర్ణాశ్రమములు చక్కఁగా నడచినవి. క్షత్రియు లీ ధర్మములను దమ విధ్యుక్త ధర్మము

లుగాఁ బరిగణించి ప్రజల కెట్టి కష్టనష్టములు జరుగకుండ చూచుచుండిరి.

"కులము గలవాఁడు శౌర్యము
గలవాఁడును నధిక సేన గలవాఁడును భూ
తలమున రాజను నామము
విలసిల్లఁగ దాల్చు మూఁడు విధముల పేర్మిన్॥
(భా. ఆది)

వేదకాలమున నేకజాతిగ వర్ధిల్లిన మానవజాతి క్రమముగా రాజకీయార్థికస్వార్థములతోఁ రాజ్యములసంపాదించినది. ధైర్య సైర్యములతోఁ బ్రజలను పాలించుట క్షత్రియధర్మమైనది.

"యజనము దానకర్మమును నధ్యయనంబును దస్యుహింసయుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేఁతయు సంగరంబున
న్విజిత విభీతిమై నరవణించుటయున్ నృపధర్మముల్ గురు
ప్రజతిలకాయమాన! సమరంబు సుధర్మువు పీనిలోపలన్."
(భా. శాం.)

యజ్ఞయాగాదులను జరుపుట, అట్టి తరుణమున బ్రాహ్మణులకు పురోహితులకు అనాథులకు దానధర్మములు చేయుట, శాస్త్రముల నభ్యసించుట, శత్రువులను, జోరులను సంహరించి ప్రజలను రక్షించి, ప్రజానురాగము జూఱఁగొనుట ప్రభుధర్మమని నిర్దేశించి యున్నారు.

విప్రధర్మ మిట్లు చెప్పఁ బడినది.

"క్రతువు సేఁత సేయించుట శ్రుతులు గాథ
లియుశిఁ జదువుట చదివించుటయును ధనము
లిగికొనుట షట్కర్మంబు లింతవట్టు
స్వర్గకృత్యంబు లండ్రు ధరామరులకు"

(భా. శాం)

వినయవిధేయతలతో లోకప్రవర్తనమునకుపకారముచేయుట, సేద్యమును బేహారమును జేయుట, పశువులఁ బెంచుట, అధ్యయనము యజనము దానములు చేయుట, ఆతిథ్యమిచ్చుట వణిజులకు ముఖ్యధర్మముగా నిరూపింపఁ బడినవి.

"ఈ మూఁడు వర్ణములకును
దా మంచిగఁ బనులుసేఁత ధర్మువు కురుధా
త్రీమహీశేశ్వర శూద్రున
కా మెయి జీవనము వాని కజుఁడు విధించెన్"

(భా. శాం)

"ధనధాన్యంబులఁ గూర్చుట
జనపతి యనుమతము లేక చన దతనికి దా
న నిరూఢి శ్రద్ధఁ గలిగినఁ
జనునది సుపవిత్ర యగుట జగతీనాథా."

(భా. శాం)

ఇది శూద్రధర్మము ఇందు జాతులను తద్వృత్తులను బ్రహ్మదేవుఁడు నిర్ణయించినట్లు చెప్పుట, కేవలము కవి బ్రహ్మల యూహామాత్రమే. వాస్తవమున కజుఁ డెవ్వరికి నట్టి వృత్తులను గల్పింపలేదు. బ్రహ్మ సంకల్పమున సర్వ మానవాళియు నేక కుటుంబికులె.

'న చర్మణో న రక్తస్య న మాంసస్య న చాస్తినః
న జాతి రాత్మనో జాతి వ్యవహారః ప్రకల్పితః'

(శుక్లయజుర్వేదము)

'జాతి యనునది చర్మమునకు లేదు రక్తమునకు లేదు. మాంసమునకు లేదు. ఎముకలకు లేదు ఆత్మకు లేదు. జాతి యనునది వ్యవహారనిమిత్తము కల్పింపఁబడినది' అని పై శ్లోకమునకు భావము.

భృగుమహర్షి 'కర్మభిః వర్ణతాం గతః' అనినట్లు, ఎవరు చేయు కర్మమును బట్టి వారికా వర్ణనామము తరువాత కాలమునఁ గలిగినది. ఇదే విధముగా బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యతి ధర్మములు, అమాత్య దూత సేవక గురు శిష్య ధర్మములు, గోసేవ గో భూ హిరణ్యాది దానధర్మములుఁ వైవాహికధర్మములు మున్నగు అనేకసాంఘిక సాంస్కృతిక రాజకీయవిషయములు చక్కఁగా వివరింపఁ బడియున్నవి,

"కులమును శీలము విద్యయుఁ
గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁగా
వలయు నుదకప్రధానా
కలితంబుగ బ్రాహ్మకర్మ గతి యిది యధిపా!"

(భా. అను)

ఇది వైవాహిక ధర్మము. బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రజాపత్య రాక్షస, ఆసుర, గాంధర్వ, పైశాచకములను అష్టవిధవివాహములందు మొదటి నాలుగు బ్రాహ్మణులకు, గాంధర్వ-రాక్షసములు క్షత్రియులకు, ఆసురము వైశ్య శూద్రులకు ప్రశస్తములు. పైశాచికవివాహ మందఱికి నింద్యము. భారత కాలమున బహుభార్యాత్వము, బహుభర్తృత్వమును గూడ దోషరహితములె. అత్యవసరసమయములందు, ప్రత్యేకవిధుల ననుసరించి, వర్ణసంకరపు వివాహములు జరుపుటయును గలదు. దేవయాని యయాతి మహారాజుల పరిణయ మందఱికిఁ దెలిసినదే కదా!

సత్యనిరూపణము చేయు భగవద్గీత వంటి యాధ్యాత్మికతత్త్వశాస్త్ర మే భాషలో నింతవఱకు వెలువడ లేదనుట యతిశయోక్తి కానేరదు. మానవుని బుద్ధి, సంధిగ్ధావస్థలోఁ దల్లడిల్లుచుండఁగాఁ, దన విధ్యుక్త ధర్మవిచ్ఛిన్నతచే మనస్సు వ్యాకులము చెందియుండఁగా, నట్టి వాని యజ్ఞాన సందేహ వ్యాకులతలను రూపుమాపి జ్ఞానమయ జ్యోతిని, రక్షణ, శిక్షణములను గలిగించినది భగవద్గీత. రాజకీయముగాను సాంఘి

కముగాను, అనేక సందేహములతోఁ గూడిన తరుణ మది. అందుచే కృష్ణభగవానుఁ డర్జునునకు గీతావళిని బోధించి నట్లున్నను, కేవల మర్జునునకే కాదు. అజ్ఞానాంధకారములో మునిఁగియున్న ప్రజానీకమున కని సుస్పష్టమగు చున్నది

భారతము తరువాత రాజకీయార్థిక, సాంఘిక, సైనిక వివరములను దెల్పు ముఖ్య గ్రంథము కౌటిల్యుని యర్థశాస్త్రము. ఈతఁడు మౌర్యచంద్రగుప్తుని సమకాలికుఁడు. ఈతడు వర్ణించిన ముద్రారాక్షస నాటక మానాఁటి రాజనీతికి ముఖ్యనిదర్శనము.

ప్రాగ్బౌద్ధ యుగమునకు సంబంధించిన జానపద సంఘ చరిత్రను దెల్పుటకు 'జాతకకథలు' మిక్కలి సహాయకారులుగా నున్నవి. ఆర్యులు ద్రావిడు లన్యోన్యసహకారసంబంధములు గడించుకొను కాలమున నీ జాతకకథ లుద్భవించినవి ఇవి యానాఁటి క్షత్రియ - విప్రధర్మములఁ దెల్పుటలోఁ బ్రసిద్ధములయినవి ఇందనేక రాజుల యొక్కయు, రాజ్యముల యొక్కయు వంశవృక్షములును, కాలనిర్ణయములును గలవు. మొదట ప్రజలే రాజు నెన్నుకొనెదరు. తదనంతర మాతని వంశీయులే రాజ్యాధికారులు, స్త్రీ లిందుల కనర్హులు. కాని విశేష మైనట్టియు, నత్యవసరసమయము లందును స్త్రీలు కూడ రాజ్యమును బాలించెదరు చైనాలో వలె భారత దేశములోఁ బ్రజల కష్టసుఖములకు పాలకులె బాధ్యులు. నిరంకుశప్రభువులను. న్యాయ ధర్మములు, శక్తియుక్తులు లేని రాజులను దొలఁగించుటకు, నొక్కొక్కతఱి వారికి మరణ

శిక్ష విధించుటకుఁ బ్రజలకుఁ బూర్తి హక్కు లున్నట్లనేక నిదర్శనములు గలవు.

వర్తకసంఘములు వృత్తిసంఘములు మహాభారత కాలమునాఁడుకూడ నున్నట్లు నిదర్శనములు గలవు. విశాలమైన 'రోడ్లు' ప్రయాణీకులకు విశ్రాంతి భవనములు (Rest Houses) అచ్చటచ్చట వైద్యశాలలు, దేశము నలుమూలల నున్నట్లాధారములు గలవు వర్తక వాణిజ్యములు దేశములోనేకాక, విదేశములతోఁ గూడ జరిగెను. ఓడలను పడవలను గొప్ప నైపుణ్యముతో నిర్మించెడివారు. విదేశములనుండి వచ్చు నోడలపై సుంకము విధించినట్లు మనకాధారములు గలవు అంతర్జాతీయ వ్యాపారమునకుఁ గావేరీ నదియొద్దున నున్న కావేరి పట్టణ మా రోజులలో ముఖ్య కేంద్రస్థాన మైనట్లు ప్రాచీన తమిళగ్రంథములు మనకు సాక్ష్యములు.

పట్టు, ఉన్ని, సన్నని దుస్తులు, కత్తులు, కవచములు, దుప్పట్లు, అత్తరు, మందుసామానులు, దంతపుసామానులు, బంగారము, వెండి, మున్నగునవి ముఖ్యముగా భారతదేశము నుండి యెగుమతి యగు సరకులు. భారతీయ యుద్ధసాధనములకుఁ బూర్వకాలము నుండి విదేశములలో గొప్ప ప్రసిద్ధి యుండెను. అలెగ్జాండరు పర్ష్యాపై దండెత్తినపుడు. తక్షణమే వచ్చి వేలకొలఁది యాయుధములను గొని తీసికొనిపోయినట్లు 'ఫిరదౌషి' తన 'సహ్నామా' అను కావ్యములోఁ దెలిపెను. ఇనుము నుపయోగించుకొనుటలో ప్రాచీనభారతీయు లెంతో

ముందంజ వేసినారని చెప్పవచ్చును. నేటి విజ్ఞాన శాస్త్రకారులను దిగ్భ్రమ గొల్పు బ్రహ్మాండమైన యినుపస్తంభమొకటి నేటికిని ఢిల్లీ దగ్గఱ గలదు. దీని నెక్కడ తయారు చేసిరో, ఎట్లు కఱగించి పోత పోసిరో ఊహించుటకందని విషయము. క్రీ. శ. నాలుగయిదు శతాబ్దముల మధ్యకాలమున దయారయిన మఱొక యినుప స్తంభము గలదు. ఇదియు జూపరుల కాశ్చర్యము గొల్పును. దీనిపై గుప్తాక్షరము (Gupta script) లలో నొక శాసనము వ్రాయబడి యున్నది. భారతీయ సైనికులకు, వారి శిక్షణమునకు నొక ప్రత్యేకత గలదు.

అలెగ్జాండరు అతని తరువాత వచ్చిన సెల్యూకసు, గొప్ప గొప్ప దండయాత్రలు చేసినపుడు, భారతీయ సైనికులు చూపిన క్రమశిక్షణ, శక్తిసామర్థ్యము లనిర్వచనీయములు. చంద్రగుప్తుని చేతిలో సెల్యూకసు పరాజయ మొంది పాఱిపోవుటకు శిక్షణ పొందిన గజసైన్యమే ముఖ్యకారణము. గజాశ్వములకు శిక్షణము నిచ్చు శాస్త్రములు భారతీయు లెప్పుడో వ్రాసిపెట్టిరి.

మట్టికుండలపై బ్రాహ్మిలిపిలో వ్రాయబడిన శాసనము లచ్చటచ్చట దొఱికినవి. క్రీ. పూ. ఆఱవ శతాబ్దములో 'పాణిని'యను మహాకవి యస్తవ్యస్తముగానున్న సంస్కృత భాషను సంస్కరించి, యొక వ్యాకరణ శాస్త్రమునుగూడ రచియించెను. ఇది కేవలము వ్యాకరణమే కాదు. ఆ నాటి సంస్కృతీ సాహిత్యములను దెల్పు మహాగ్రంథము. సోవియట్

ప్రొఫెసర్ Th Tscherbatsky గారి గ్రంథమును గూర్చి యిట్లభివ్యక్త పఱచెను. "One of the greatest productions of the human mind" మానవుని బుద్ధిబలము వలన సృష్టింపఁబడిన ప్రసిద్ధవస్తువులలోనిది (పాణినీయము) యొకటి పాణిని గ్రీకుల లిపిని కూడఁ దన గ్రంథములోఁ జేర్చినాఁడు. ఇందువలన అలెగ్జాండరు దండయాత్రకుఁ బూర్వమే భారత గ్రీకు దేశములకు సంబంధసామ్యములు గలవని తెలియుచున్నది.

జ్యోతిషము, వైద్యశాస్త్రములకు భారతదేశము పుట్టినిల్లు చరకుఁడు వ్రాసిన ఔషధగ్రంథము, శుశ్రుతుఁడు వ్రాసిన శస్త్రవైద్య గ్రంథములు నేఁటికి ననుసరింపఁ బడుచున్నవి. శుశ్రుతుఁ డనేకవిధములైన శస్త్ర చికిత్సకుప యోగించు సాధనములఁ జేర్చెను. క్రీ. పూ. మూఁడు నాలుగు శతాబ్దములలో పశువైద్యశాల లున్నట్లు బౌద్ధ గ్రంథములు చాటుచున్నవి బహుశః ఈ పశువైద్యశాలలు 'అహింసా' సిద్ధాంతమే ప్రధానముగాఁగల జైన, బౌద్ధ మత ప్రభావములచే నేర్పడియుండవచ్చును.

బీజగణితము – అంకగణితము – రేఖా గణితములను, బిందువు–వ్యవకలనపుగురులను ఏనాఁడో భారతీయులు కని పెట్టినారు గ్రీకు, రోమను, పర్షియనులకు వేయికంటె నెక్కువ గురులు లేవు ఋగ్వేదకాలము నాఁటికే భారతీయు లసంఖ్యాకములైన సంఖ్యలను గుర్తించియున్నారు. ఒకట్ల స్థానమునుండి యెంచఁగా 'మహాభూరి' యను స్థానమువఱకు

ముప్పదియైదు స్థానసంజ్ఞ లగుచున్నవి. ఇన్ని సంజ్ఞలు గల స్థానము లే దేశము లోను లేవు భారతీయ కాలమానమును పరిశీలించినచో నింతకంటె నాశ్చర్యమగును. 43,20000 సంవత్సరము లొక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 కడచిన నొక మన్వంతరము. పదునాలుగు మన్వంతరములు గడచిన బ్రహ్మ కొక పగలంట ఆహా! ఎంత యద్భుతము.

ఆంగ్లేయులు అరబ్బుల యొద్దను, అరబ్బులు భారతీయుల నుండియు, రేఖా బీజాంక గణితముల సంగ్రహించినట్లు చెప్పుదురు. వేదముల నాడే దైవపీఠములను దయారు చేయుటకు నీ రేఖాబీజగణితము లత్యవసరముగా నుండినట్లు ప్రమాణములు గలవు. రేఖాగణితము యజ్ఞయాగాది సమయము లందత్యవసరము. అది క్రమముగా నేడు మిక్కిలి యభివృద్ధి చెందినది బిందువుయొక్క యుపయోగమును భారతీయులు క్రీ. పూ. 3 వ. శ. లోనే కనుగొనినారు. క్రీ పూర్వమే గణితశాస్త్రములో ననేక గ్రంథములు వెలువడినవి. క్రీ. పూ. 8 వ శ లో బౌధాయనుడును, 5 వ.శ. లో ఆపస్తంభుడు, కాత్యాయనుడు మున్నగువారును రేఖాగణితమును జక్కగా వివరించిరి. ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రజ్ఞుండగు 'ఆర్యభట్టు' క్రీ. శ. 474 లో బీజగణితమును, జ్యోతిష్యమును గలిపి తన యిరువది మూడవ యేట వ్రాసెను. ఉపలబ్ధమగు బీజగణితగ్రంథములలో నిదియే మొదటిది

ఈయన తరువాతఁ బేర్కొనఁదగిన వారు మొదటి భాస్కరుఁడు (క్రీ. శ. 522), బ్రహ్మగుప్తుడు (క్రీ. శ. 628) ద్వితీయ భాస్కరుఁడు (క్రీ. శ. 1114). మున్నగువారు. ద్వితీయ భాస్కరుఁడు జ్యోతిష్యము-బీజ-అంకగణితములను వేఱు వేఱుగా రచియించెను. అందులో వాని 'లీలావతి' గణితము నేఁటికి నాచరణములో నున్నది, 'ఖాలిప్ అల్ మన్సూర్' పాలించు కాలమున భారతీయవిద్వాంసు లనేకులు (75?-74) బాగ్దాదునకుఁ బోయిరి. బాగ్దాద్ పట్టణ మా కాలమున విద్యలకుఁ కేంద్రస్థానము. భారతీయులు తమతో ననేక గణితజ్యోతిశ్శాస్త్రాదులను దీసికొని పోయిరి. గ్రీకులు - రోమనులు - యూదులు, ఇతరపాశ్చాత్యులుకూడ నచ్చటికి వచ్చి క్రొత్తవిద్యల నభ్యసించి పోయెడివారు. అట్టి సమయములో భారతీయగణిత శాస్త్రములు అరబ్బీభాషలోని కనువదింపఁబడినవి. వానిని జూచి మొదట అరబ్బులు, తరువాత పాశ్చాత్యులు కూడ మన గణిత శాస్త్రమును నేర్చుకొనిరి.

ఇతిహాసయుగమున నొకవిధమైనవిశ్వవిద్యాలయములు (Forest Universities) ప్రశాంత వాతావరణములందు వర్ధిల్లి నట్లనేక ప్రమాణములు గలవు. అచ్చటికి దేశవిదేశ విద్యార్థులు వచ్చి శాస్త్రములు చదివి సైనిక శిక్షణము పొంది, విజ్ఞాన తేజముతో నరిగెడువారు. అట్టి వానిలో కాశీ విశ్వవిద్యాలయ మొకటి. దీనికి సమీపమున నున్న Deer park లోనే బుద్ధభగవానుఁడు తన తొలి సందేశము నిచ్చెను. నేఁటి పెషావరునకు దగ్గఱ 'తక్షశిల' యను

పేరుతో నొక విశ్వవిద్యాలయ ముండెడిది. ఇచట ముఖ్యముగా వైద్య విజ్ఞానశాస్త్రములు (Science) చతుష్షష్టి కళలను నేర్చుకొనుటకు దేశము నలుమూలలనుండి విద్యార్థులు విద్వాంసులు వచ్చెడివారు బుద్ధుఁడర్భకుఁడుగా నున్నపు డీ 'తక్షశిల' యందా రితేరిన వైద్యుని పిలిపించెడి వారట. పాణిని కూడ నిచ్చటనే విద్యనభ్యసించెనని చెప్పెదరు. బీహారులో 'విక్రమశిల' విశ్వవిద్యాలయము కథియవార్ నకు సమీపమునఁ గల 'వాలాభి' విశ్వవిద్యాలయము నలందా విశ్వవిద్యాలయము, దక్షిణమున 'అమరావతి' విశ్వవిద్యాలయము, గుప్తరాజుల కాలమున 'ఉజ్జయిని' విశ్వవిద్యాలయములు పూర్వము గొప్ప ప్రసిద్ధిలో నుండినవి.

నాట్య-సంగీతములు భారతీయుల వినోదకార్యక్రమములలో ముఖ్యమైనవి అలెగ్జాండరు కాలమునాఁటి గ్రీకు చరిత్రకారుఁడు అరియన్ ఏమి వ్రాసెనో చూడుడు.

No nation is tender of singing and dancing than the Indian సంగీత నాట్యములపై భారతీయులకుఁ గల యనురాగము, మఱే జాతికిని లేదని స్పష్టముగాఁ జెప్పవచ్చును

యజ్ఞయాగాదులలో జంతు - నరబలుల నిచ్చుట, ఆహారమునకై జంతువులను హింసించుట, ప్రజలు స్వార్థమునకై హింసాత్మకమగు చర్యలు గావించుట మితిమీరిపోయి న్యాయ ధర్మ సత్యము లడుగంటి పోయెను. అట్టితరుణమున బౌద్ధ - నములు జనించెను. గౌతముఁడు బౌద్ధమతమును

మహావీరుఁడు జైన మతమును సృష్టించి మూఢ విశ్వాసము లతోఁ బ్రవర్తించు ప్రజలకు ధర్మపథమును జూపిరి, వీరిద్దఱు నించుమించుగా సమకాలికులు ఇద్దఱును క్షత్రియ వంశజులే.

మౌర్యచంద్రగుప్తుని కాలమున పాశ్చాత్య దేశము లతో సన్నిహిత సంబంధము గలదు. చంద్రగుప్తుని కుమా రుఁడు బిందుసారుని కాలమున ఈజిప్టు నుండియు, పశ్చి మాసియాను పాలించు సెల్యూకసు కుమారుఁడు ఆంటిఓచస్ (Anti ochus దగ్గఱ నుండియు పాటలీపుత్రమునకు రాయ బారులు వచ్చెడివారు చంద్రగుప్తుని మనుమఁడు అశోకుఁడు బౌద్ధమతమును స్వీకరించి, మత వ్యాప్తికై, మత ప్రచారకుల పాశ్చిమ దేశములకుఁ బంపి, సన్నిహితసంబంధముల నెల పుటయే గాక, భారతీయుల సంస్కృతీసాహిత్యముల నా దేశ ములలోఁ బ్రతిష్ఠించెను. అశోకుఁడు క్రీ పూ. 232 లో నిర్యాణ మొందినను భారత దేశములోనె గాక, విదేశము లయిన వోల్గానుండి జపానువఱకు నెన్నో దేశములలో నాతని నామము నేఁటికిని జపించు వారెందఱో గలరు. 'చరిత్ర ప్రసిద్ధిఁ జెందిన రాజు లెందఱో యున్నారు వారిలో అశో కుఁడు దేదీప్యమానమైన యొక నక్షత్రము వంటివాఁడు' అని చరిత్ర కారుఁడు హెచ్ జి. వెల్సు వ్యక్తపఱిచెను,

మౌర్యులు - కుషానులు - గుప్తరాజులు - శాతవాహ నులు - ఇక్ష్వాకులు - చాళుక్యులు - రాష్ట్రకూటులు - మహ మ్మదీయులు మున్నగు రాజు లెందఱో పరిపాలించినను భార తీయ సంస్కృతి చెక్కు-చెదఱక యట్లే నిలిచియున్నది.

మొదటనుండియు పర్ష్యా భారతదేశములకు రాకపోకలు, సంబంధ సామ్యములు గలవు. ఋగ్వేదములో పర్ష్యావారిని, 'పర్షావాలు' అని పేర్కొనిరి. మొగలు చక్రవర్తుల కాలములో పర్ష్యాభాషయే రాజభాషగా నుండెడిది, నేటి భాషలలో పర్ష్యాపదము లెన్నో లీనమై పోయినవి, అశోకుని కాలమున నిర్మింపఁబడిన భవనములు. మొగలుచక్రవర్తుల యంతఃపురములు, మసీదులు పర్ష్యావారి కళా చాతుర్యమును దలఁపించుచుండును ఇరాన్ నుండి ప్రసిద్ధ కళాకారులు వచ్చి. మొగలు చక్రవర్తుల యాస్థానమునఁ బని చేసెడి వారు, ఆగ్రా-ఢిల్లీ మున్నగు ప్రదేశములలోఁగల తాజమహల్ - జుమ్మామసీదు మున్నగు ప్రసిద్ధభవనము లన్నియు భారతీయ, ఇరాన్ దేశముల కళాసమ్మేళనముఁ జాటుచున్నవి. ఆంగ్లేయ పాలనములోఁ బాశ్చాత్య దేశములతో నెక్కువ సంబంధ మేర్పడినది.

గ్రీసు దేశపు స్త్రీలు మన దేశములో రాజాంతఃపురములయందు దాసులుగాఁ బనిచేసినట్లు ప్రాచీన నాటకములలోఁ గలదు. పూర్వము గ్రీసుదేశమునుండి ఓడలమీఁద మంచి సారాయము దిగుమతి యగుచుండెడిది పాటలీపుత్రపు రాజొక సారి 'ఆంటి ఓచస్' అను రాజునకు 'మధురమైన సారాయమును - మేడిపండ్లను - ఒక కుతర్కతత్త్వవాదిని కొనిపంపు'మని లేఖ వ్రాసి పంపినాఁడఁట, అంతట నాతఁడు తీయని సారాయమును - కమ్మని మేడిపండ్లను బంపెదనుగాని కుతర్కవాదిని అమ్ముటకు గ్రీకు చట్ట మంగీక

రింపదని చమత్కారముగా జవాబు పంపినాఁడఁట. భారతీయ తత్త్వశాస్త్రజ్ఞులు గ్రీసుదేశము పోయి సోక్రిటీసుతో వాదోపవాదములు జరిపెడివారఁట. ప్రసిద్ధతత్వశాస్త్రజ్ఞుఁడగు 'ఎపోలోనియస్' 'తక్షశిల' విశ్వవిద్యాలయమును దర్శించి నట్లు చెప్పుదురు.

ఇరాన్, గ్రీసు దేశములకంటె చైనాతో భారతదేశమున కెక్కువ సంబంధము బౌద్ధమతమువలన నేర్పడినది. బౌద్ధమతము వ్యాప్తిలోనికి రాకముందే, చైనాతో వర్తక వాణిజ్యముల మూలమున నెక్కువ సంబంధముగలదు. క్రీ. శ. 67. లో కాశ్యపమతంగుఁడను నతఁడు 'మింగితి' అను చైనా చక్రవర్తి యాహ్వానముపై చైనాకుఁ బోయినట్లు కలదు. ఆతఁడు 'లో' నదికి సమీపమునఁగల 'లోయాంగ్'లో నివాస మేర్పఱచుకొనెను. తదనంతరము భారతీయవిద్వాంసు లనేకులు చైనాకుఁబోయి యచటనే స్థిరపడిపోయిరి. క్రీ. శ. 6వ శ. లో మూఁడు వేలకు పైగా బౌద్ధసన్న్యాసులు, పదివేల భారతీయకుటుంబములు, 'లోయాంగ్'లో నివాసము లేర్పరచుకొని, యచ్చటనే యుండిపోయిరి. వీరు పోవుచు ననేక సంస్కృత గ్రంథములనుగూడఁ దీసికొనిపోయి చైనాభాషలోని కనువదించిరి. కుమారజీవుఁడు క్రీ. శ. 401 లో చైనాకుఁ బోవుచు వివిధములైన 47 గ్రంథములను దీసికొనిపోయెను. ఈతఁడు నాగార్జున పండితుని జీవితచరిత్రను చైనాభాషలోఁ జక్కఁగా వ్రాసినాఁడఁట 'జైనగుప్తుఁడు' కూడ క్రీ శ. 6వ శ. లో చైనాకుఁబోయి, 37 సంస్కృత

గ్రంథములను చైనా భాషలోని కనువదించెను. ఈతని విజ్ఞానమునకు మెచ్చుకొని, అప్పటి చక్రవర్తి 'తాంగ్'వంశీయుఁడీతని శిష్యుఁడాయెను. చైనానుండి మనదేశమునకెందఱో యాత్రికులు వచ్చి, వివిధ ప్రదేశములను, ప్రజలను జూచి యప్పటి భారతీయ స్థితిగతులను వ్రాసిపెట్టిరి. ఆ విధముగా వచ్చిన యత్రికులలో 'ఫాహియాన్', 'సుంగ్ యూన్' 'హుయాన్ సాంగ్', 'ఇట్సింగ్' ముఖ్యులు. ఫాహియాన్ క్రీ. శ. 5వ. శ. లో భారతదేశమును సందర్శించెను ఈతఁడు కుమారజీవుని ముఖ్యశిష్యుఁడు. పాటలీపుత్ర విశ్వవిద్యాలయమున నీతఁడు విద్య నభ్యసించినట్లు చెప్పుదురు. హర్షవర్ధనుఁడు క్రీ. శ. 7 శ. ములో పరిపాలించు కాలమున హుయాన్‌సాంగ్ వచ్చి, దేశమంతయుఁ దిరిగి యనేక విషయములను గ్రహించెను. బహుసంవత్సరము లీతఁడు 'నలంద' విశ్వవిద్యాలయమున గడపెను. అచ్చట పదివేలమంది విద్యార్థులు చదువుచుండెడివారఁట. ఇచ్చట హుయాన్‌సాంగ్ న్యాయపరీక్షలో కృతార్థుఁడై, మాస్టర్ ఆఫ్ లా (Master of law) డిగ్రి బొందితుదకా విశ్వవిద్యాలయమునందు నుపప్రధానాధ్యాపకుఁడు (Vice Principal)గాఁ గూడ పనిచేసెను.

హుయాన్‌సాంగ్ తన గ్రంథములో నాఁటి రాజకీయ ఆర్థిక-సాంఘిక-కుల-మత పరిస్థితులను చక్కఁగా వర్ణించెను, హర్షవర్ధనుఁడు, నాఁటి చైనాచక్రవర్తియుఁ బరస్పరము రాయబారులను బంపుకొని, తమ యాస్థానములందు వారిని గౌర

వించెడువారు. తుదకు ఢిల్లీ సుల్తానగు 'మహమ్మద్ బిన్ తుగ్లకు'కూడ 'ఇబన్ బతూతా' అను అరబ్బీయుని చైనాకు రాయబారిగాఁ బంపెను. క్రీ. శ. 14వ శ మధ్యలో బెంగాలు సుల్తానుకడకు హుమషియున్, ఫిన్‌షియన్, అను చైనా రాయబారులు వచ్చి గొప్ప గౌరవమును బొందిరి. సుల్తాన్ ఘియాషుద్దీన్ కూడఁ బేరొందిన దూతలను చైనాకుఁ బంపినటు నిదర్శనములు గలవు ఈ సంబంధము నేఁటికి నల్లే జరిగి పోవుచున్నది.

ఇదేవిధముగా నాదికాలమునుండి సింహళము-బర్మా-మలయా - జావా-సుమత్రా - బోర్నియో -సయాం-కంబోడియా - జపాను - ఇండోచైనా దేశములకు, భారతదేశమునకు, వర్తక వాణిజ్యములు, జైన - బౌద్ధమతముల మూలమున, రాకపోకలు, సంబంధ సహాకారము లేర్పడినవి. భారతీయు లనేకు లా దేశములకు వలసగాఁబోయి, స్థిరపడి, భారతీయ సంస్కృతి సాహిత్యములను ఆచార్య వ్యవహారముల నచ్చటి సంస్కృతీ సాహిత్యములతో మేళవింపఁజేసిరి.

చంపా, అంగ్‌కారా, శ్రీవిజయ మజపహిత్ మున్నగు ఆగ్నేయాసియా ప్రాంతములలో నేఁటికి సంస్కృతాధ్యయనము సాగుచున్నది అచ్చటి రాజులకు రాజ్యములకుఁగూడ సంస్కృతనామములే పెట్టబడినవి నేడు మలయా, థైలాండులలో రాజోద్యోగులకిచ్చిన బిరుదములు సంస్కృతనామములే. జావా-బాలీ-ద్వీపవాసుల నాట్యము, మన భరత నాట్యమునకు సంబంధించినది భారతీయులను జూచియే

'ఫిలిఫ్ఫైన్' ద్వీపవాసులు వ్రాయుట నేర్చుకొనినారు. పరి శీలించినచో 'కంబోడియా' భాషలో ననేక సంస్కృతపద ములు గన్పట్టును 'జావా ద్వీపములో 'బోరో బుదూరు' అను చోట బుద్ధుని సంపూర్ణగాథను రాతిపై జెక్కినారు.

భారతీయకళలు సామాన్యముగా నందఱ కందు బాటులో నుండునవికావు భారతీయతత్త్వ, మత, ఆధ్యాత్మిక భావములతో సమ్మిళితమై క్రొత్తవారి కగోచరముగా నుండును. వారికీ మత తత్త్వభావములు దెలియనిచో భార తీయ కళాసౌందర్య మవగాహనమగుట దుర్లభము. సంగీ తములో ప్రాచ్యపశ్చిమ దేశముల కనంతమైన భేదభావము గోచరించును. కళలోని సత్యమును గుర్తించి, కళాసౌంద ర్యము నానందించుట గ్రీకుల యుద్దేశము. కళలో నాంతరం గిక సత్యమునుగుర్తించి, తన్మయత్వము చెందుట భారతీయుల మతము. లారెన్సు బిన్యన్, యి బి. హావెల్, మున్నగు పాశ్చాత్యులెందఱో భారతీయ కళాసౌందర్యమును వేనోళ్లఁ గొనియాడినారు.

అజంతా చిత్రములను జూచినచో, నిజముగా జరుగు చున్న యొక నాటకమునుజూచి యానందానుభూతిని పొందు చున్నట్లగును. ఆచిత్రములలో నందఱు అందమైన స్త్రీలే. వారిలోఁ గొందఱు నాట్యము చేయుచున్నట్లు, కొందఱు సంగీతము నాలాపించుచున్నట్లు, చిత్రింపఁబడిరి కొందఱు నిలబడియు, కొందఱు కూర్చుండియు, చూచుచున్నట్లు- ఇట్లు వివిధ భంగిమలలో కన్నుల పండువుగాఁ గోలాహాల

ముతో నుత్సవము లు జరుపుచున్నట్లు గన్పట్టును, క్రీ. శ. ఏడె నిమిది శతాబ్దములలోఁ జెక్కఁబడిన 'ఎల్లోరా" శిల్పము మతెచ్చటను గన్పట్టదు ఒక జాతిని దొలిచి, యద్భుతమైన శిల్పమును ప్రదర్శించినారు. ఈ గుహాలో మధ్య నొక కైలాస మందిరము గలదు. దానిని నిజముగా మానవులే యూహించి చేసినారా? లేక దేవతలు వచ్చి నిర్మించినారా? యను భ్రమను గల్గించును.

ఇదే కాలమున 'ఎలిఫెంట్' గుహాలలోఁ జెక్కఁబడిన "త్రిమూర్తి" విగ్రహము, "శివనటరాజ" విగ్రహము మామల్లపురమునందలి విగ్రహశిల్పము, నేఁడునునవ్యశిల్పము వోలె అత్యాశ్చర్యము కల్గించుచున్నదని పాశ్చాత్యు లెందఱో మెచ్చుకొనియున్నారు.

భాతీయ నాటకములకు, రంగస్థలమున నొక ప్రత్యే కత కన్పట్టును. ఋగ్వేదములో ఈ నాటకీయ సంభాష ణము గోచరించును. నాటక ప్రారంభమున కిది బీజప్రాయ మనవచ్చును. రామాయణ- భారతములలో నాటకములను రంగస్థలములను గుఱించి, యనేకనిదర్శనములు గలవు. గోపి కల నృత్త – నృత్య – సంగీతములు నాఁటి నాట్యరంగమును స్మృతికిఁ దెచ్చును పాణినికూడఁ గొన్ని నాటకీయ పద్ధతు లను బేర్కొని యున్నాఁడు. భరతుని నాట్యశాస్త్రము క్రీ. శ. 3 వ శ. లో వెలువడిన దందురు. అప్పటికి సంపూర్ణ ముగా నాట్య- నాటక కళాభివృద్ధి చెందినందుననే, యిట్టి

శాస్త్రము వెలువడినది. క్రీ పూ. 2 వ. శతాబ్దములో నిర్మింపఁబడిన యొక నాటక భవనము చోటానాగపూరు జిల్లాలోఁ గల 'రాంఘుర్ కొండల సమీపమున బయలువడి నది. దీని నిర్మాణమునకు నాట్యశాస్త్రములో వివరించిన పద్ధతికిని సరిపోయినది. క్రీ. పూ. 3 వ శ. లో సంస్కృత నాటకములు కుప్పలు తెప్పలుగా వెలువడినవి. భాసుని పద మూఁడు నాటకము లీశతాబ్దమునాఁటివే. బుద్ధ చరిత్రమును వ్రాసిన అశ్వఘోషుఁడు క్రీ. శ మొదటి శతాబ్దములోని వాఁడు కాళిదాసుని శాకుంతలము పాశ్చాత్యులను మిక్కిలి యాకర్షించినది. 789 లో సర్ విలియమ్సుజోన్సు, శాకుంతలము నాంగ్లములోని కనువదించెను. తరువాత జర్మను-ఫ్రెంచి ఇటలీ డానిష్ భాషలలోని కనువదింపఁ బడినది. ఉజ్జయినీని బాలించిన విక్రమాదిత్యుని యాస్థాన నవరత్నములలో కాళిదా సొకఁడు. ప్రకృతివర్ణనము జీవితానురాగ మీతని కవిత్వములోని ప్రత్యేకత.

'క్రీ. పూర్వమే కాళిదాసు ప్రకృతి నవగాహము చేసికొని, చక్కఁగా మానవహృదయమును జిత్రించినాఁడు. పాశ్చాత్యులు క్రీ శ. 9, వ. శ వఱకు సృష్టిరహస్యమును దెలిసికొనలేకపోయినా'రని అమెరికా దేశస్థుఁడు రైడర్ (ryder) అను విద్వాంసుఁడు మేఘదూతమును జూచి, మిక్కిలి యబ్బురముతోఁ బల్కెను. మృచ్ఛకటికమును వ్రాసిన శూద్రకుఁడు కూడ క్రీ.శ, ముందువాఁడు. 1924 లో న్యూయార్కు 'పట్టణములో మృచ్ఛకటికము నాంగ్లమున

ప్రదర్శింపఁగాఁ ప్రజలు ముగ్ధులై గొప్పగాఁ బొగడినారు. హర్షుని సమకాలికుఁడు భవభూతి. హర్షుఁడు సంస్కృతమున మూఁడు నాటకములను రచించెను. ఆక్స్‌ఫర్డు యూనివర్సిటిలో సంస్కృత శాఖాధ్యక్షులయిన Poıfessor of Sanskrit) విల్సన్ ఏమిచెప్పెనో చూడుఁడు "It is impossible to conceive language so beautifully musical or so magnificently grand, as that of the verses of Bhavabhuti and Kalidasa". భవభూతి, కాళిదాసుల కవిత్వము సరళమై సంగీతము వోలె మధురముగా నుండును. పాత్రప్రయోజనమునకై ప్రాకృత-పైశాచిక భాషలనుగూడ వీరుపయోగించిరి ఆదికాలమునుండి భారతీయులు గ్రీకులవలె విషాదాంత నాటకముల కెక్కువ ప్రాముఖ్య మీయలేదు.

సంస్కృతభాష 'లాటిన్' గ్రీకు భాషలకంటెఁ జాల సంపన్నమై భావపరిపుష్టి కలిగియుండును. ఈ భావము నేసర్ విలియం జోన్సు 1784 లో వ్యక్తపఱిచెను.

మోనియర్ విలియమ్స్, అనునతఁడు 'హిందూయిజమ్' అనుగ్రంథములో సంస్కృత భాషనుగుఱించి యిట్లు వ్రాసి యున్నాఁడు. "భారతదేశములో సుమారు రేనూఱు ప్రాంతీయ భాష లున్నప్పటికిని అచట ఒకే యొక దైవభాష ఒకే యొక పవిత్రసారస్వత మున్నది. ఉత్తమ నీచ కుల మత ప్రాంతీయ భేదములు లేక, భారతీయు లందఱును దానిని పవిత్రముగా నెంచి పూజించెదరు. ఆ భాషయే సంస్కృతము. ఆ సారస్వతమే సంస్కృత సారస్వతము. స్థూలభావములోఁ జెప్ప

వలయునన్న సంస్కృతభాష వేదములకు (వేద-జ్ఞానమునకు) రక్షణభవనము. హిందూ వేదాంత శాస్త్రము, తత్త్వ శాస్త్రము, న్యాయశాస్త్రము, పురాణములకు సంస్కృత భాష యొక శకటమువంటిది. సంస్కృతభాష యొక దర్పణము; అందు భారతీయులయొక్క భావములు-ఆచారవ్యవహారములు మున్నగు వారి సంస్కృతి యంతియు సుస్పష్టముగా గోచరించును, ఇంక నెక్కువగాఁ జెప్పవలయునన్న సంస్కృతభాష నొక గనితోఁ బోల్పవచ్చును. ఆ గని నుండి కావలసిన పదార్థములను (materials) దీసికొని దేశభాషల నభివృద్ధి పఱచుకొనవచ్చును మతమునకు-శాస్త్రములకు సంబంధించిన ముఖ్యభావములను వెలిఁబుచ్చుటకుఁ గావలసినంత పదార్థజ్ఞాన (Materials)ము అందున్నది."

ఈ సంస్కృతిసాహిత్యముతో సర్వవిధములఁ బోటి చేయుచు క్రీస్తునకుఁ బూర్వమునుండియు దక్షిణభారతమున ద్రావిడభాషలు వర్ధిల్లినవి. ఉత్తర దేశపు దండయాత్రిలతో దక్షిణద్రావిడులు సతమత మగుచున్నను, దమ సంస్కృతీ సాహిత్యములవిడనాడక శాఖోపశాఖలుగా వృద్ధిపఱచుకొనిరి. ఉత్తర దేశమునుండి కళాకారులు ప్రజలు తండోపతండములుగ వచ్చి దక్షిణమున స్థిరపడిపోయిరి. దక్షిణాత్యుల సంస్కృతీసాహిత్యములతోఁ గలసిపోయిరి.

సంస్కృతము నుండి నేఁటి హింది- వంగ - గుజరాతి మహారాష్ట్రిభాష లుత్పన్నమైనట్లు, మూల ద్రావిడభాష నుండి, నేఁటి తమిళము - మళయాళము- తెలుగు-కన్నడము-

తుళు_కొడగు మున్నగులిపి సంస్కరణము గలభాష లుత్పన్నమైనవి. ఇవి కాక లిపిలేని తుద - కోట - గోండు - ఖోండు ఒరాయను_రాజమహాలు అను భాషలను అనాగరికులు మాటాడుదురు.

ఇందు తమిళ సారస్వతము చాల ప్రాచీనమైనది, ఉపలబ్ధములైన గ్రంథములలో 'తొలికాప్పియమ్' చాల పురాతనమైనది. ఇది. లక్షణగ్రంథము. ప్రాచీనకాలమునుండియు, దక్షిణభారతమున పండితసంఘములు సభలుజరుపుట యాచారము పూర్వము తమిళదేశమున మూఁడు సంఘము లుండెడివి. 'అందు మొదటిసంఘములో 549మంది కవులుగలరనియు, శివుడు - మురుగను అందుండిరనియు, నయ్యది 4440 సం॥ లుండి సముద్రముచేఁ దుడిచి వేయఁబడిన మధురాపట్టణమున నుండెననియు, నాఁటిగ్రంథములు పరిపాడల్ - ముదునారై - ముదుకురుకు - కళరియావిరై అనునవియును, అందు 89 మందిరాజులు పాలించిరనియు ఇరయనార్ వ్రాసిన అహప్పొరుళ్ అను గ్రంథమునకు నక్కీరుని వ్యాఖ్యానమున నొక గాథ కలదు. అప్పటి లక్షణగ్రంథము 'పేరగత్తియ' మను గ్రంథము. దీనిని అగస్త్యుఁడు అరవభాషకు వ్యాకరణముగా వ్రాసెను.'

రెండవ సంఘములో 59 మంది సభ్యు లుండిరనియు, 3700 కావ్యములు విమర్శింపఁబడినవనియు చెప్పుదురు ఈ సంఘము కవాటపురమున వర్ధిల్లినది. ఈ పురముకూడ

సముద్రముచే ముంచివేయఁ బడినది. మూఁడవ సంఘము 1850సం॥ లుండినదఁట. దీని కధ్యక్షుఁడు నక్కీరుఁడు. దీనిలోఁ 49 మంది సభ్యు లుండిరి. క్రీ పూ. 10 వ. శతాబ్దమున తమిళకవిత్వ ముండెనని పి. టి శ్రీనివాస అయ్యంగారు చెప్పిరి. పత్తుపాట్టు, మధురై కాంజి, ఇళంగోవడిగళు అను యువరాజు వ్రాసిన శిలప్పదిగారము, మున్నగు గ్రంథము లలోఁ బ్రాచీన రాజకీయ - సాంఘిక-మత-పరిస్థితులు, అద్ద మున ప్రతిబింబించినట్లు స్పష్టముగా వర్ణింపఁబడినవి తరువాత బౌద్ధ జైన మతగ్రంథములు, శైవవాఙ్మయము, కంబ రామాయణము మొదలగునవి సంస్కృత సారస్వతప్రభావ మున బయలుదేరినవి.

కన్నడ భాషలోఁ బ్రాచీనతమమయినది నృపతుం గుని కవిరాజమార్గమను లక్షణగ్రంథము. కర్ణాట వాఙ్మ యమును వీరశైవులు, జైనులు, మత ప్రచారమునకై గ్రంథ ములు వ్రాసి వృద్ధిఁ బొందించిరి. ఆదిపంపఁడు, పొన్నఁడు రన్నఁడు మున్నగువారు సంస్కృత సారస్వత ప్రభావమును కర్ణాటవాఙ్మయమునకుఁ బరిచయము చేసిరి. వీరు సంస్కృత పురాణముల ననువదించిరి. బహుగ్రంథజాలముతో విలసి ల్లుచు నధికనాగరికత కాలవాలమై ద్రావిడభాషలో సంస్కృత ప్రభావము నెక్కువగా సంపాదించినది మళయా ళము. ఇందు రామచరితము-రామకథాపాట్టు, అను రెండు గ్రంథములు మిక్కిలి ప్రాచీనములైనవి. వీనిలో నాఁటి జీవన విధానము సూచింపఁబడినది.

'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యని యే నాఁడో క్రీడాభిరామములోఁ జెప్పఁబడినది. తరువాత రాయలవారు కూడ వచించియున్నారు. క్రీ. పూ. నుండియు తెలుఁగు భాష సెలయేరువలె సాగి వర్ధిల్లినది నేఁడు సంస్కృత వాఙ్మయ సాహచర్యముతో క్షీరసాగరము వోలె గంభీరమై విస్తృతిఁ జెందినది. మన కుపలబ్ధమైన ప్రాచీనగ్రంథములలో నన్నయ భారతము మొదటిది అంతకు ముందుఁ గూడ ననేక గ్రంథము లున్నవి. కాని యుపలభ్యములు కావు శైవ వాఙ్మయములో నాంధ్రుల రాజకీయ- సాంఘిక- మత తత్త్వ పరిస్థితులు చక్కఁగా వర్ణింపఁబడినవి తెలుఁగు జాతీయతను నిలఁబెట్టినవాఁడు తిక్కన మహాకవి, ఈతఁడు కవిబ్రహ్మ. ఇంచుమించుగా మహాభారతము నంత నీతఁడు తెనిఁగించెను. ఎఱ్ఱాప్రగడ భారతారణ్యపర్వశేషమును దెనిఁగించెను. ఈ ముప్వురను కవిత్రయ మందురు. తెలుఁగు సారస్వత వృక్షమును జక్కఁగా బోషించిన వారిలో కృష్ణదేవరాయలు, అతని యష్టదిగ్గజములు ముఖ్యులు. తంజావూరు-మధురలను బాలించిన నాయకరాజులు కూడఁ గొంత వఱకు నీ వృక్షమును బెంచిరి తరువాత కొద్దిరోజు లెవరును దలఁచుకొనలేదు. ఇంతలో చిన్నయసూరి - కందుకూరి - చిలకమర్తి - మున్నగు సంస్కర్త లెందఱో బయలుదేరి పోటీలతోఁ బెంచిరి. అంతఁ దెలుఁగు సారస్వత వృక్షము శాఖోపశాఖలుగా వర్ధిల్లి, నేఁటి తెలుఁగు వారి కొక ప్రత్యేకత నిలఁబెట్టుచున్నది. తెలుఁగు వారి వేషభాషలు-ఆచార వ్యవ

హారము లెందఱికో యాదర్శప్రాయము లైనవి. కేతన తెలుఁగు వారి భూషణములను జక్కఁగా వర్ణించెను.

'మట్టియ లుజ్జ్వల మణి నూపురంబులు
కొలనూలు - వస్త్రముల్ ముత్తియములు
కన్నవడంబులు గట్టి నూళ్ళను సుద్ద
సరితీగె మినుకులు సందిదండ
అంగుళీయములును, హారకంకణములు
చేకట్టుపాలెలు చెన్ను మెఱుఁగు
టాకులు సరిపెణ లాలక్తకము పూఁత
కాటుక తిలకంబు కమ్మపువ్వు
లాదిగాఁగల మేలి ద్రవ్యముల నొప్ప
పసదనము చేసి యుచితరూపంబు దాల్చి
బాలచంద్రిక బోటినై పజ్జ కరిగి
దానువచ్చిన లోగిలి దరియఁజొచ్చి'

ఈ పద్యములో స్త్రీల మై పూఁతలు, ఆభరణములు కొంత వఱకు బోధపడఁగలవు కొన్ని యిప్పటికిని వాడుకలోనున్నవి. లిపిలేని భాషను మాటాడు - దొమ్మర - లంబాడి - ఎఱుకల - కోయ మున్నగు ద్రావిడులు తెలుఁగు దేశమునందంతటను గలరు. దక్షిణ భారత భాషలన్నియు మొదటనొకే భాషనుండి జన్మించి, అక్కసెల్లెడవలె రూపసామ్యముండియు నేఁడు రాజకీయ సాంఘిక దేశకాలపరిస్థితుల వలన నేఁటి భాషలలో నెంతో మార్పువచ్చి రూపసామ్యము మృగ్యమైనది.

సంస్కృతవాఙ్మయ సంబంధ సాహచర్యముల వలన రూపు రేఖలు మాఱి పోల్చుకోలేనంత మార్పు ఈభాషలలో గోచరించుచున్నది ఆంగ్లేయ పాలనా ప్రభావము చేతను, ఆంగ్లభాష ప్రభావము చేతను, భారతీయభాషలన్నింటిలోను నూతనశాఖోపశాఖలు వర్ధిల్లి నూతనత్వము గోచరించుచున్నది.

మహోన్నతమైన భారతీయ సంస్కృతీసాహిత్యములు జాతీయ జీవితాభివృద్ధి. విదేశీయుల దండయాత్రలవలనను, పరదేశ పరిపాలకులచే నికృష్టముగాఁ జూడఁబడినను దనరూప సౌందర్యము నావంతయు పరివర్తన చెందలేదు. ప్రొఫెసర్ మేగ్డోనెల్ తన సంస్కృత వాఙ్మయ చరిత్రలో నీ భావమునే వెల్లడించెను

1882వ. సం॥లో మ్యాక్సుముల్లరు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో నుపన్యసించుచు భారతదేశమును గూర్చి 'సకలసంపదలతోను' ప్రకృతిసంపద సౌందర్యములతోను వర్ధిల్లుచు స్వర్గసీమనుధిక్కరించు దేశము ప్రపంచములో భారతదేశ మొక్కటియే కన్పట్టుచున్న'దని గొప్పగా మెచ్చుకొనెను.

'బుద్ధి బలములోను జీవితసుఖసౌందర్యములు గడించుటలోను ప్లాటో-క్యాంటు-గ్రంథములను జదివినను తృప్తిలేనివారికి సంతృప్తి గలిగించుటలోను భారతదేశమునకు భారతదేశమే సాటి. గ్రీకు-రోమనుల సిద్ధాంతములను బారాయణము చేసినవారికిఁగూడ నైహికజీవితమే కాక ఆధ్యాత్మిక జీవిత సుఖ సౌందర్యములను శాశ్వతత్వమును జేకూర్చునది భారతీయ సాహిత్యమే' యనికూడఁ దెలిపెను.

'మానవుఁడు తాను గలలోఁ గాంచిన సర్వవిషయములను గన్నులతోఁ గాంచఁగలిగినది ప్రపంచములో ఆదినుండియు నొక్క భారతదేశములో మాత్రమే' యని రొమెయిన్ రోలండ్ యతిశయోక్తిగాఁ జెప్పినను గొంతవఱకు సత్యమేయని యొప్పుకొనక తప్పదు. అట్టి యున్నతోన్నతమైన సంస్కృతీసాహిత్యములు - కళలు - వర్తక వాణిజ్యములు-శాస్త్రములు - మున్నగువానితోఁ గొప్ప ప్రసిద్ధి ప్రశస్తులను బొందిన భారతమాత ఆంగ్లేయుల పాలనమువలన కళంక మొందినది. భారతమాతను శ్వేతముఖులు శృంఖలముల నుండి కాపాడుటకు ఝాన్సీరాణి - తంతియాటోపి-నందా సాహెబ్ మున్నగు వారు స్వాతంత్ర్య సమరమును సాగించి వీరమరణము నొందిరి. తుదకు మహాత్మాగాంధి అహింసావ్రత దీక్షతో జాతీయోద్యమమును నడపి, శ్వేతముఖులఁ బాఱద్రోలి, స్వాతంత్ర్యమును సాధించి, 'భారతమాత'కు స్వేచ్ఛనొసఁగి దివికేగెను. పిమ్మట పండిత జవహర్‌లాల్ నెహ్రూ ప్రజాప్రభుత్వమును స్థాపించి. ప్రపంచశాంతి మానవసౌభ్రాత్రము శ్రేయస్సులకొఱకు నవిరామముగాఁ గృషి సల్పిసల్పి, భారతీయులను దుఃఖసాగరమున ముంచి అకస్మాత్తుగా అమరపురి కరిగెను

(Discovery of India by Nehru ఆధారముతో)



# నా రచనలు

| | | | |
|---|---|---|---|
| 1. | జగజ్జ్యోతి | ... | రు 2-00 |
| 2. | విజ్ఞాన మంజరి | ... | 1-50 |
| 3. | కథామృతము | ... | 0-60 |
| 4. | పచ్చిమోసము (స్త్రీపాత్రలేని హాస్య నాటిక) | | 0-75 |
| 5. | శతకరాఘవమ్ | (అచ్చులో) | |
| 6. | శ్రీ వెంకటేశ్వర శతకము | ,, | |
| 7. | చిగురాకులు (గేయములు) | ,, | |
| 8. | పరివర్తన (నవల) | ,, | |
| 9. | కలిసిన మనసులు (నాటకం) | ,, | |

శ్రీ వెంకటేశ్వర గ్రంథమాల,
పొన్నూరు. (గుంటూరు జిల్లా)

